# విశ్వప్రకాశం

## ఆధ్యాత్మికమాసపత్రిక

శ్రీయువనామ సం. ధనుర్మాస, త్యాగరాజస్వామి ప్రత్యేక సంచిక
జనవరి 1996

సంపుటి : 2 సంచిక : 3 వెల రూ. 5-00



*ప్రకాశకులు*
సర్వార్థ సంక్షేమ సమితి
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్,
గాంధీనగర్, హైదరాబాద్.

*ఈ సంచికలో........*



ముఖచిత్రం : శ్రీత్యాగరాజస్వామి

సంపాదకీయం

# ధనుర్మాసము

*'దినయామిన్యౌ సాయంప్రాతః, శిశిర వసంతౌ పునరాయాతః'* అని భగవత్పాదులవారి దివ్యవాణి. అనంతమైన ఈకాలచక్రంలో అయనాలు, ఋతువులు, మాసాలు పరిభ్రమిస్తూనే ఉంటాయి. అదే సూర్యుడు. అదే చంద్రుడు. అదేభూమి. అదే ఆకాశం. అదేగాలి. ఆదేనీరు. అయినా ప్రకృతి నిత్యనూతనం. దివ్యభవ్యనవ్యరాగరసరంజితం. పసిపాప బోసినవ్వు వ్యాలుఎప్పటికీ ఆకర్షకాలే. ఆకాశంలో నక్షత్రాల తళతళలు అనంతకాల పథంలో నిరంతర యాత్రికుడైన మానవుడుకి సతతం ఆసక్తికరాలే. 'చెట్టునకు మొగ్గదొడిగెడు చేష్టగలదు, కోరకమునకు వికసించు గుణము గలదు, విరికి వలపులువెదచల్లు విద్యగలదు, దేని కొరకిదియంతయు దేనికొరకు' అని ప్రకృతి పరమరామణీయకానికి కవితాపారవ శ్యదిదృక్షువులై ప్రశ్నించుకున్నారు వేంకట పార్వతీశ్వర కవులు తమ ఏకాంతసేవలో. పరమార్ధ భావసంతృప్త హృదయులై 'ప్రేమకొరకు ప్రేమకొరకు ప్రేమకొరకు' అని సమాధానించు కున్నారు కూడాను

వర్తమానకాలంలో ప్రేమావతారులైన విశ్వయోగి విశ్వంజీ మహారాజ్ వారు కూడా ఎక్కడ ఏసభలో అభిభాషించినా దివ్య సందేశం వినిపించినా ఆశీః ప్రసంగం చేసినా అనుగ్రహభాషణం చేత అలరించినా మానవ హృదయాలలో నెలకొనవలసిన ప్రేమప్రాశస్త్యాన్ని గూర్చేనొక్క చెపుతారు ఆ సదస్సులో, సభలో, సమావేశంలో, ప్రేమరసావతారమూర్తిలాగా ప్రకాశిస్తారు. శ్రీస్వామియోగీశ్వరుల పెదవులపై దివ్యమందహాసం వదనమండలంలో విలక్షణమైన కాంతిపుంజప్రసరణం, చొక్కపుపసిడి కాంతులీనే మూర్తిమత్వ శోభ, అలతిఅలతి పలుకులలో దివ్యవచోవిస్ఫురణం, మానవాళి సుఖసార్థక పరస్పర ప్రేమపూరిత జీవన మహత్వా కాంక్ష, మానవత్వ సముద్దీప్త ప్రబోధం, వాత్సల్యం, లాలన, సమాజ అనుపాలన, అనురాగం, వెరసి విశ్వయోగి మహరాజ్ వారి వాణిగా రూపొందుతుంది.

ప్రకృతికి కూడా తనసృష్టిపై మమత్వంమెండు. అందుకనే ఏయేఋతువుల ఆయాశోభలను వెలారిస్తుంది. అవి మానవాళికి మహోపకారకాలు. చండభానుని మండుటెండలులేకపోతే సవిత సైతం శీతల సలిల ధారలు ఎక్కడి నుంచి కురిపిస్తాడు! కటికచీకటులలముకోకుంటే నిండుపున్నమి పండువెన్నెల గుండెలను కరగించుటెట్టులు? ఆకురాలే కాలమన్నది ఆగమించక

పోయినప్పుడు చీకు వృక్షం కొత్తపెళ్ళికూతురులా శోభించుపెట్టులు?

అందువల్ల ఋతువులన్నీ ప్రకృతి మానవుడికి ప్రసాదించిన వరాలు మార్గశిర్ష పుష్యమాసాలు హేమంత ఋతువు. మాఘఫాల్గుణాలు శిశిర ఋతువు. ఆ వెంటనే వసంతర్తువు. మళ్ళీ ఒక ఆవర్తం మొదలు. హేమంత ఋతువులో మంచు బాగా పడుతుంది. పచ్చారాసూది మొనల ముత్యాలలాగరిక పోచల మీదమంచు బిందువులున్నాయని విశ్వనాథవారు వర్ణించారు. తెనాలి రామకృష్ణయ్యగారు పచ్చిక పట్టుల ఉదయకాలపు హేమంత శోభను అప్పుడేతొలి సూర్యకిరణాలు ప్రసరించి నప్పుడు భూమిపైనే హరివిల్లులు విరుస్తాయని వర్ణించారు.

ఇప్పుడు మానవ ప్రకృతి కలుషితమైనట్లే ప్రకృతిని కూడా కలుషితం చేస్తున్నాడుమానవుడు. అతిసుఖాపేక్షతో యాంత్రిక జీవనం వైపు పరుగులు తీస్తున్నాడు. కాబట్టి ప్రకృతికి ఆటపట్టులైన మన గ్రామ సీమలు కూడ తమపూర్వపు సౌందర్యాన్ని కోల్పోతున్నాయి. నగరీకరణ కాలుష్యభూతం పల్లెపట్టులవైపుకూడా సాచిసాచి అంగలు వేస్తున్నదినేడు. దయ, సౌజన్యం, సౌశీల్యం, అంతఃకరణం, ధర్మం,న్యాయం, ప్రేమ, భక్తి, పల్లెకూటములలో కూడా బడిలో, గుడిలో నేడు బోధించటం లేదు. బోధించినా వినే తీరిక గూడా ప్రజలలో తగ్గిపోతున్నది. కృత్రిమ విలువలవైపు, స్వార్థ పూరితమైన రాజకీయాలవైపు అకృత్రిమ, అకల్మషజీవనులైన గ్రామీణ ప్రజలు కూడా ఆకర్షితులవుతున్నారు క్రమక్రమంగా. ఈనాటి క్షుద్రరాజకీయాలు, సాంఘిక పరిణామాలు పల్లెలను సైతం విడిచిపెట్టటంలేదు. అందువల్ల ప్రకృతి సౌందర్యం కనుమరుగైపోతున్నది.

ఈనాటికాలంలో భారతీయ ధార్మికజీవనం, సాంస్కృతిక ఔదార్యం పిల్లలు చదివే పాఠ్యాంశాలుగా ఉండడంలేదు. అందువల్ల మనపండుగలు, పబ్బాలు, అతిథి అభ్యాగత ఆదరణ, ధార్మిక విలువలు, ప్రకృతి పరిరక్షణం రాబోయే తరాల మన పిల్లలకు తెలిసే అవకాశంలేదు. ఇక ధనుర్మాసమంటే ఏమిటో అది ఎప్పుడో వస్తుందో దాని విశేషం ఏమిటో తెలుస్తుందా? ఆముక్తమాల్యద అంటే తెలుస్తుందా? అవతారాలు అంటే తెలుస్తుందా?

వైష్ణవులకు పన్నిద్దరాళ్వారులు పరమపూజ్యాలు.అందులో పెరియాళ్వారులు శ్రీవిష్ణుచిత్తులు. అంటే అందరిలోనూ పెద్ద వారు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువుకే మామగారు ఆయన. శ్రీవిల్లిపుత్తూరు అనే చోట శ్రీరంగమన్నారు

స్వామి వారికి మాలా కైంకర్యం చేసేవారు శ్రీవిష్ణుచిత్తులు. ఆయనకు తులసివనంలో ఒక బాలిక దొరికింది.ఆమెకు గోదాదేవి అని పేరుపెట్టి పెంచి పెద్దచేశారు పెరియాళ్వారు. పెరిగి పెద్దదవుతున్న కొద్దీ భగవంతుడిపైన ఆమెకు అనురాగం కలిగి శ్రీరంగనాథుణ్ణే వివాహమాడాలని ఆమె నిశ్చయించుకుంది. స్వామివారికి తండ్రి మాలలు అర్పించటానికి ముందేవాటిని ఆమె ధరించి తన సౌందర్యాన్ని పరీక్షించుకునేది. తాను ధరించిన పుష్పహారాలు భగవంతుడికి అర్పించేది కాబట్టి ఆమెకు ఆముక్తమాల్యద అనేపేరు వచ్చింది.ఈగోదాదేవి శ్రీకృష్ణస్వామిని గూర్చి రోజుకొక కీర్తనతో మార్గశి మాసమంతా ఆయనను ఆరాధించింది. ఈ కీర్తనలనే తమిళంలో పాశురాలంటారు. నెలరోజులపాటు తెల్లవారుఝామున సఖులతో ఈ పాటలు పాడుకుంటూ ఆమె శ్రీకృష్ణుణ్ణి ఆరాధించేది. ఇవి సంఖ్యలో 30 కాబట్టి వీటికి తిరుప్పావై అనే పేరు వచ్చింది. ఇప్పటికీ విష్ణ్వాలయాలలో రోజుకొక పాశురం చొప్పున ముప్పై రోజులు వీటిని గానం చేస్తారు. ఇదీ ధనుర్మాసం విశిష్టత.

పుష్యమాసం విశేషం ఇంకొకటి కూడా ఉంది. జీవన్ముక్తులైన త్యాగరాజస్వామి వారి ఆరాధనోత్సవం ఈమాసంలో జరుగుతుంది. కర్ణాటక సంగీత విద్వాంసులందరూ పరమ భక్తిభావంతో ఈ ఆరాధనోత్సవాన్ని నిర్వహిస్తారు. తంజావూరు దగ్గర తిరువాయూరులో శ్రీత్యాగరాజస్వామి వారి మహాసమాధి వద్ద మూడు రోజుల పాటు నిర్విరామంగా త్యాగరాజస్వామి వారి కీర్తనలు సంకీర్తనం చేస్తారు. పుష్య బహుళపంచమినాడు త్యాగరాజస్వామివారి నిర్యాణం. ఈ సంవత్సరం త్యాగయ్యగారి 150 వ వర్ధంతి జరుగుతున్నది. సుప్రసిద్ధ సంగీత విద్వాంసులందరూ ఆరాధనోత్సవాలలో పాల్గొంటున్నారు. ఆయన పొంది పాడారు గాని పాడి పొందలేదు అన్నారుట భగవాన్ శ్రీరమణ మహర్షి శ్రీత్యాగరాజస్వామి వారిని గూర్చి చెబుతూ. అంటే ఆయన తరించి తర్వాతనే సంకీర్తనం చేశారు అని అర్థం. 96 కోట్ల రామనామ జపంచేసి జీవన్ముక్తులైనారు శ్రీత్యాగరాజస్వామి. సర్వోపనిషత్సారమంతా తన కీర్తనలలో ప్రతిపాదించారు త్యాగరాజస్వామి. జ్ఞానానికిన్నీ భక్తికిన్నీ తేడా ఏమీలేదనిన్నీ ఒకపక్షంలో భక్తియేమిన్న అనిన్నీ నిరూపించారు శ్రీత్యాగబ్రహ్మం. ఆయన ఆంధ్రదేశంలో పుట్టక పోయినప్పటికీ ఆంధ్రుడై పుట్టటం ఆచంద్రార్కం తెలుగు వారికి పరమానందహేతువు. ఈ కల్పంలో చరిత్ర తెలిసిన తర్వాత విశిష్ట ప్రజ్ఞాశాలురైన మహామహులైన ఆంధ్రులను ఆరుగురిని ఎన్నవలసి వస్తే అందులో త్యాగరాజస్వామి ఒకరు

అంటారు శ్రీబెజవాడ గోపాలరెడ్డి.

శ్రీ త్యాగరాజస్వామివారికి విశ్వప్రకాశం తన యేటికోళ్ళు అర్పిస్తున్నది.

* * *

కాలగమనంలో మరొక మైలురాయి గడచిపోతున్నాము. ఇంగ్లీషు కేలండర్ ప్రకారం కొత్త సంవత్సరం ఆగమించింది. ఇంకొక నాలుగు సంవత్సారాలలో ఒక సహస్రాబ్ది ముగిసి మరొక సహస్రాబ్ది హంగు చేసుకుంటున్నది కాలరంగస్థలాన గజ్జెకట్టడానికి. ప్రతి సహస్రాబ్ది మలుపులో ఏవేవో కొత్త పరిణామాలు సంభవిస్తాయనేది చరిత్రాభిజ్ఞులవక్కాణం. ఈసారి ఒక నవశకానికి నాంది పలుకుతుందేమో ఆగామి 21 వ శతాబ్దిఆరంభం.

నిద్రాణమై యున్నభారతీయాత్మను ప్రబుద్ధం చేయాలన్నది ' విశ్వప్రకాశం' ఆశయం. తన పాఠకులకు ప్రోత్సాహకులకు స్ఫూర్తిదాతలకు సహాయకులకు అనుమోదకులకు కొత్త సంవత్సరపు శుభాకాంక్ష లందిస్తున్నది.

---

*"పుట్టుకతోనూ వాతావరణం వల్లా పరిసరాలవల్లా ఉత్పన్న మయిన సాంప్రదాయాలను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నించడము లాభదాయకం కాదు. సరిగదా అది దేవతా దూషణం వంటిది. అన్నిమతాల సారాంశం ఒక్కటే. అయినా అది వేరువేరు రూపాలలో యిమిడివుంది. మతాలనే యీరూపాలు శాశ్వతం. విజ్ఞులైన వారు ఈ పై రూపాలక మోసపోక వానిలోని ఆత్మని పరిశీలించాలి."*

*- గాంధీజీ.*

---

*" ఆత్మవత్ సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి"*

*- ఆర్యవాక్యం*

---

"మానవుని యొక్క ప్రవర్తనను, శీలమును, నీతిని, సద్గుణములను పాలించని చదువు చదువా"

*-'సముద్రపు దిబ్బ' నవలలో శ్రీ విశ్వనాథసత్యనారాయణ*

"లౌకికపు చదువెంత చదివినను ధనాశ వృద్ధిపొందును"

*- శ్రీ విశ్వనాథసత్యనారాయణ*

# శుభాభినందనలు

"విశ్వప్రకాశం" పాఠకులకు, పోత్సాహకులకు, శ్రేయోభిలాషులకు, బంధుమిత్రులకు, తదితరులకు 1996 ఆంగ్ల సంవత్సరమరియు యువనామ సంవత్సరపు సంక్రాంతి శుభాభినందనలు కాలచక్రం యెంత త్వరగా సాగిపోవుచున్నదో ఎంత గొల్పుచున్నది. వెనుదిరిగి చూచేలోగా విశ్వప్రకాశం ప్రథమ వార్షికోత్సవం జరుపుకొని, రెండవ సంవత్సరంలో నూతన ఆంగ్లసంవత్సర శుభాకాంక్షలు మీకందిస్తున్నది. ఈ పత్రిక ద్వారా, సెమినార్ల ద్వారా, మీటింగుల ద్వారా ఇతరత్రా "సర్వార్థ సంక్షేమ సమితి" నిర్వహిస్తున్న ఆధ్యాత్మిక కార్యక్రమాలు పాఠకులపై, జిజ్ఞాసువులపై, శ్రోతలపై వారి వారి మనోభావాలపై ఎంతవరకు ముద్ర వేయుచున్నవో పాఠకులే నిర్ణేతలు.

నేటి, మానవుని, మానవ సమాజాన్ని గమనిస్తే ఇలాటి కార్యక్రమాలు వేల సంఖ్యల్లో చేసినా సరిపోవేమోయని తోస్తుంది మానవుని ప్రవృత్తి మారుటకు మానవత్వము సమాజంలో నెలకొనాలి. ప్రేరేపింప బడాలి. అంతే కాని భౌతికసుఖాలతో, సౌకర్యాలతో సంఘంలో కోరుకున్న సంస్కరణం రాదు. సనాతన ధర్మాచరణం పట్ల సంఘంలో మక్కువ పెంచాలి. ముఖ్యంగా కావల్సినవి కూడు, గుడ్డ, నీడలతో పాటు అవసరాలకు సరిపడు ద్రవ్యము, వానితో పాటు నెలసరి ఆదాయము, వానికితోడు కనీస అవసరాలగు ఫోను, వాహనము ఇత్యాది వసతులు కావలసినవే. ఎవరూ కాదనరు. ఈ మాత్రముంటే, వ్యక్తికి తృప్తి దానితో శాంతి, దానితో భక్తి, దానితో మానవత్వపు లక్షణాలగు సహనము, సమత, మమత, అనురాగము, దయ, మున్నగు సల్లక్షణాలు సమకూరునని తర్కిస్తూ, సాంఘికవేత్తలు, శాస్త్రవేత్తలు, సంస్కారులు అభిప్రాయ పడుచున్నారు. వినేవారికి కూడా అది సమంజసమనే అనిపించవచ్చు. మానవుడై పుట్టినందులకు ఈ మాత్రపు కనీసావసరాలు లేనిదే, జన్మసార్థకమెలాయని, సదాచారుడెలా కాగలడని, ఆధ్యాత్మికపు చింత ఎలాకలుగునని బల్లగుద్ది వాదించేవారు కూడ ఉంటారు.

అయితే నేటి కొన్నిపరిస్థితులు చూస్తుంటే పైవానికి భిన్నంగాయున్న వాతావరణం బహుధా కాన్పించుచున్నది. సంపాదనకు పరిమితి లేదు. రోజువారి లేదా ఇతర అవసరాలకు చింతలేదు. అప్పుడు ఇలాటి వారిలో ఆధ్యాత్మికత, మానవత్వము, మున్నగునవి తప్పకుండా వుండవలెగదా! వానికి బదులు ప్రేమానురాగాలు మరచి, ఈర్ష్యాద్వేషాలు, పంతాలు, పట్టింపులు, మానసిక ఒత్తిడులు, ఏదో కావల్సినది ఇతరులు పొంది, తనకు లభించుటలేదనే నిరంతర తపన, ఎదుటివాడు ఏదో పైపైకి వెళ్లుచున్నాడని, ఏవిధంగా వానిని క్రిందికి లాగాలని వ్యూహములు, ఆలోచనలు, వీనికి తోడు, తానేదో శ్రమించి, సాధించి, సంపాదించి పెడితే ఇతరులేదో ఆశిస్తున్నారని, దోచేస్తారని భ్రమించుతున్నవారు, అలాగే ఒకే గురువు చెంత శిష్యుల మని చెప్పుకొని, మోసగించి, వెన్నుపోటు పొడిచి, సంపాదనే ధ్యేయంగా యెంచుచున్న దుర్మార్గవర్తనులును కానవస్తారు డబ్బున్నవానికి జబ్బులుండునన్నట్లు, ధనికునికి అజీర్తి, దరిద్రునికి ఆకలియన్న సామెత నిజమనిపిస్తుంది. ఇలావివిధ మార్గాన్వేషణలో రోజులు నెలలు, ఎళ్లు గడుపుచు కాలయాపన చెయుచున్నవారి గురించి సమాధానం లభించదు. ఈ పంతాలు పరోపకారం కొరకు

సంఘసేవకు లేదా ఇతరుల బాగుచేయుటకుపకరిస్తే యెంతబాగుండునోయని, ఒకోసారి విచారం వేస్తుంది. వారిగురించి ఆలోచిస్తే జీవితమంటే యేమి తెలియని అమాయకులనిపిస్తుంది.

ఇలాంటి పరిస్థితులలో కూడా మానవునిలో మార్పు మానవత్వ విలువలు సనాతన ధర్మాచరణ, ధార్మికతత్వం, సమాజంలో కనువిప్పు, దేశసుభిక్షం, విశ్వమానవసమైక్యత, వసుధైక కుటుంబం, విశ్వశాంతి, మున్నగు "సర్వేజనాస్సుఖినోభవంతు, లోకస్సమస్తా స్సుఖినోభవంతు" యనేనానుడుల ననుసరించి, మా "సర్వార్థ సంక్షేమ సమితి", వెనుదిరిగి చూడదలచక లోకకళ్యాణార్థం, ముందడుగిడుచు, మీరెల్లరు 1996సం.నికి శుభములు బడసి ధర్మాచరణులు కాగలరని శుభాభినందనలు తెలియచేయుచున్నది.

విశ్వప్రకాశం మాసపత్రిక ద్వారా, శ్రీశ్రీశ్రీవిశ్వయోగివిశ్వంజీ ఆశీస్సులు, సలహాలు కోరేవారు ఒక పేజీకివలయు ప్రకటన, ధనము అనగా రు.500/- పంపిస్తే స్వామివారి అనుగ్రహమును ఆశీస్సులను పత్రికద్వారా తమకు ప్రకటించుట జరుగునని తెలియ చేయుచున్నాము.

రాబోయే మార్చి 5వ తేదీ (5-3-1996) స్వామిజీ జన్మదినమును పురస్కరించుకొని సర్వార్థ సంక్షేమ సమితి మరో సావనీరు విశ్వకిరణం III ప్రచురించదలచినది.ఇప్పటికే విశ్వకిరణం" సావనీర్లు 1 & II ముద్రించబడినవి. ఆ రోజునే స్వామిజీ నిర్మించిన "విశ్వమానవ సమైక్యతా స్థూపం" విశ్వనగర్‌లో ప్రారంభోత్సవము జరుపుటకు స్వామిజీ ముహూర్తం నిర్ణయించిరి. దానికి ఇంకా దాదాపు 25(ఇరువదియైదు) లక్షల రూపాయిలు అవసరమైయున్నది. స్వామిజీ భక్తులకు, వారిచే శుభములు పొందిన, దైవజ్ఞులకు ఇదొక చక్కని అవకాశము. వారికి వారినిర్మాణమునకు, సహకరించకోరు అభిమానులు, భవన నిర్మాణకర్తలు, వ్యాపారులు, ఫ్యాక్టరీల అధిపతులు, మున్నగువారు తమతమ ప్రకటనలతో పాటు క్రింద సూచించిన వాని రేట్ల ప్రకారం డీ.డీ. లు లేదా చెక్కులు జనవరి 25వ తేదీలోగా, సర్వార్థ సంక్షేమ సమితి పేరిట పంపించగలరని కోరుచు ఈకార్యము తమందరి బాధ్యతగా భావిస్తు ప్రోత్సాహమిస్తారని మరీమరీ కోరు తున్నాము. నగదు డబ్బు స్వీకరించబడదని మనవి. ప్రకటన లిచ్చేవారు 80 G ఇన్‌కంటాక్సు మినహాయింపు లబ్ధిపొంద వీలున్నది.

| | | |
|---|---|---|
| వెనుక కవరు పేజీ | రు.50,000-00 | 4 రంగుల్లో |
| రెండవ కవరుపేజీ | రు.30,000-00 | 4 రంగుల్లో |
| మూడవ కవరుపేజీ | రు.30,000-00 | 4 రంగుల్లో |
| స్పెషల్ పేజీ | రు.10,000-00 | 4 రంగుల్లో |
| లోన పూర్తి పేజీ | రు. 5.000-00 | ఒక రంగులో |

పై ప్రకటనలు కాక స్వంతంగా, కైంకర్యము చేయదలచినవారు తోచినంత M.O. ద్వారా, స. సం. సమితికి పంపితేవారి పేర్లు మాపత్రికలో ప్రకటింపబడునని తెలియచేయు చున్నాను.

ఇట్లు

**పి. వి. మనోహరరావు, అధ్యక్షులు, స. సం.స. హైదరాబాదు.**

# అనుభవతరంగిణి

*శ్రీ జి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ*

విశ్వమందిరానికి తరుచుగా వచ్చే విశ్వకుటుంబ సభ్యులకు "మామ్మగార్ల త్రయా"న్ని గురించి బాగా తెలుసు. అందులో ఒకరు వల్లూరు సావిత్రమ్మగారు. మాస్టరుగారి చేత ప్రేమ పూర్వకంగా "మామ్మగారు" అని పిలుపించుకొనబడుతున్న సావిత్రమ్మగారికి మాస్టరు గారంటే అమితమైనభక్తీ, పుత్రవాత్సల్యం రెండూ ఉన్నవి. మేస్టరు గారు ఆమెకు అనేకమైన అనుభూతుల్ని ప్రసాదించారు. ఆమె పూర్వపుణ్య విశేషం చేత ఆమె, ఆమెకూతుళ్ళూ, కొడుకూ, ఆమె బంధువులూ అంతా మాస్టరుగారి అనుగ్రహానికి పాత్రులయ్యారు.

1976లో మాస్టరుగారు దత్తక్షేత్రాలయాత్ర తల పెట్టినప్పుడు బాపట్లలోని ఆలూరి క్రిష్ణమూర్తి గారి భార్య మాణిక్యమ్మ ద్వారా ఆ యాత్రావిషయం ఆమె తెలుసుకొని తానూ యాత్రలో పాల్గొనాలని గుంటూరు వచ్చింది. ఆ విధంగా మాస్టరుగారి దర్శనం మొదటిసారి ఆమెకు లభించింది.

ఆమె రైలుపేటలోని మాస్టరుగారి గదిలోకి ప్రవేశించి మాస్టరుగారికి పాదనమస్కారం చేస్తుంటే ఆమెవొళ్ళు ఆమెకు తెలీలేదు. దివ్యపరీమళాలేవో చుట్టుముట్టు తుంటే అదిదేవతా నిలయమని పించిందేగాని ఆగది గదిగా కనిపించలేదామెకు. "నిత్యం, ఈ గదిలో మాస్టరుగారిని అంటిపెట్టుకొని ఉండేవాళ్ళు ఎంత అదృష్టవంతులో గదా" అని అనిపించిందామెకు. "నాకా అదృష్టం ఎప్పుడు పడుతుందో? మా అబ్బాయికి గుంటూరు ట్రాన్స్ఫరై నేనెప్పుడు ఇక్కడికి వస్తానో?" అని ఆమె మనస్సులో అనుకొంటూంటే, అంతవరకు గదిలో అటూ ఇటూ తిరుగుతున్న మాస్టరుగారి దగ్గర శెలవు తీసుకొని వెళ్ళుతూ ఆమెను రమ్మని పిలిస్తే "మీరు వెళ్ళండి. నేనిక్కడేవుంటాను- ఎందుకో ఎక్కడికీ వెళ్ళాలని బుద్ది పుట్టటం లేదు" అందివాళ్ళతో. మాస్టరు గారు ఆమెవైపుచూచి "అందరితో కలసివచ్చినప్పుడు అందరితో వెళ్ళాలి- వెళ్ళండి" అన్నారు. అప్పుడు విధిలేక ఆమె లేచివెళ్ళింది.

ఆ రాత్రియాత్రా స్పెషల్ బస్సు బయలుదేరింది. అంతా మంత్రాలయం వెళ్ళారు. ప్రొద్దున్నే స్నానానికని సావిత్రమ్మగారు మరొకావిడను తోడు తీసుకొని

తుంగభద్రానది దగ్గరకు వెళ్ళింది. స్నానం చేసింది. అక్కడ మాస్టరుగారు మంత్రాలు చెప్పడానికని తోడుకొని వచ్చిన వేదపండితుడు వెంకటేశ్వరశాస్త్రి గారితో కలసి స్నానం చేస్తున్నారు. సావిత్రమ్మ లోగడ తనకు గురూపదిష్టమైన మంత్రాన్నేదో జపిస్తూ ఒడ్డున కూచుంది. మాస్టరుగారామెను చూచి వెంకటేశ్వరశాస్త్రిగారితో "ఆవిడ కూచుంటే ఇహ అక్కడ అట్లాగే కూచుంటుంది. వెళ్ళి తీసుకరా!" అని చెప్పి ఆవిడను తమ దగ్గరికి పిలిపించుకొన్నారు. ఆ తర్వాత ఆమె తక్కిన భక్తులతో కలసి రాఘవేంద్ర స్వామి వారి గుళ్ళోకి పోయి కొబ్బరికాయ కొట్టి బయటకు వచ్చింది. క్యూలో నుంచుని గుళ్ళోకి పోతున్న మాస్టరుగారు ఆమెను చూచి చిరునవ్వునవ్వారు. అంతాస్వామి దర్శనంచేసుకొని వచ్చేటప్పటికి చాలా టైం పడుతుందని, కాళ్ళు బాగావాచి నొప్పిగా ఉండటం చేత ఆమె పోయి బస్సులో పడుకొంది. మాస్టరుగారు ఈశ్వరినీ, పాపనూ ఆమె దగ్గరికి పంపించి భోజనానికి పిలిపించారు. అందరి భోజనాలు కాగానే బస్సు బయలుదేరింది. బస్సు హంపిలో ఆగినప్పుడు ఆమె కాళ్ళనొప్పివల్ల దిగలేకపోయింది అందరితో. "మాస్టరుగారు విభూది ఇస్తే బావుణ్ణు - ఈ బాధ లేకుండా పోయేది " అని ఆమె అనుకొంటూంటే, ఆమె వెనుక సీటులో కూచోని ఉన్న మాస్టరుగారు ఆమె దగ్గరికి వచ్చి విభూతి ఇచ్చారు. ఆమె సంతోషంతో స్వీకరించింది. తెల్లవారేటప్పటికి కాళ్ళవాపు తగ్గి, మామూలై నడిచేశక్తి బాగావచ్చింది - ఆమెకు.

సావిత్రమ్మగారు కాళ్ళనొప్పితో దిగలేక బస్సులో పడుకొని ఉన్నప్పుడు ఒకవిచిత్రం జరిగింది. మాస్టరుగారు బస్సుదిగి, ఒకచోట కూచోని అందరితో మాట్లాడుతున్నప్పుడు ఒక అవధూత వచ్చాడు. వెంటనే మాస్టరుగారు ఒకవిస్తట్లో అన్నం తెప్పించి, అందులో రెండురూపాయలు పెట్టి ఆ అవధూతముందు పెట్టించారు. ఆ అవధూత నేలమీది ఒకమట్టి గడ్డతీసుకొని, అన్నంలో కలిపి మూడు ముద్దలు చేశాడు. ఒక ముద్ద తననోట్లోపెట్టుకొన్నాడు. తర్వాత తనవెంటవచ్చిన కుక్కకు మరోముద్దపెట్టాడు. ఆ తర్వాత ఒక పందివస్తే మిగిలిన ఆముద్దను దానికి పెట్టి ఎటో వెళ్ళిపోయాడు. ఆయన ఎటుపోయాడో, ఎంతవెదకినా ఎవరికీ కనిపించలేదు. మాణిక్యమ్మగారు ఇదంతా చూచి ఆశ్చర్యం పట్టలేక పోయింది. గబగబా బస్సు దగ్గరికివచ్చి, సావిత్రమ్మగారిని చూచి "అయ్యో! మీరు రాలేదు. షిర్డీసాయిబాబాగారు వచ్చారు. మాస్టరుగారు భోజనం పెడితే తిని వెళ్ళారు. మేమంతా చూచాం. మీకా అదృష్టం లేదు" అంది. ఆమాటలు వినంగానే సావిత్రమ్మగారు "అయ్యో! బాబాగారిని చూడలేక

పోతినిగదా! ఎంత దురదృష్టవంతురాలిని" అని బాధపడటం మొదలుపెట్టింది ఇంతలో ఆమెకొక దృష్టాంతమైంది. ఒకఏడేళ్ళ పిల్లవాడు ఆమె దగ్గరికి వచ్చి "బాబాను చూడలేదని బాదపడుతున్నావా?" అంటూ ఆమె వొళ్ళోకూచున్నాడు. "నామాడుకి ఆముదం పెట్టు" అని తొందరజేశాడు, ఆమె ఆముదం పెట్టింది. ఆ పిల్లవాడి తల రాగి చెంబులా మెరిసిపోతున్నది వళ్ళో కూచున్న పిల్లవాడు క్రమక్రమంగా బరువెక్కటం మొదలుపెట్టాడు. "ఇట్టా చేస్తే నేను భరించ గలనా పసిపిల్లవాడిలా ఉంటే భరించగలను గాని-" అని అనుకొంది తనలో. అంతలో ఆమెకు మెలకువ వచ్చింది. దృశ్యం చెదరిపోయింది. *(సశేషం)*

## కార్తీకమాస పూజలు - మన సంస్కృతి

# కార్తీక మాహాత్మ్యము- వనసమారాధన

శ్రీ హరినాగేశ్వర శర్మ

*భరతః ఆదిత్యః తస్య భాః-భారతీ (యాస్క నిరుక్తము)*

భరతుడాదిత్యుడు. ఆయనపత్ని, దీప్తిలేక వాక్కు భారతి యని భాష్యకర్తలు వివరించిరి.

*జాతాః వేదాః యస్మాత్తః - జాతవేదాః।*
*జాతే జాతే విద్యత ఇతి వా - జాతవేదాః।*
*జాతం సబావజంవేత్తీతి - జాతవేదాః।*
*త్రయీమయాయ త్రిగుణాత్మ ధారిణే।*
*విరంచి నారాయణ శంకరాత్మనే।।*
*ఏష ఏవాగ్నిహోత్రంచ ఫలంచైవాగ్నిహోత్రిణామ్ (ఆదిత్యహృదయం)*

త్రయీమయుడగు నాయాదిత్యుని యందలి వాక్కు (త్రయీ విద్య) బారతి అనగా వాగ్దేవత. వేదములీతని నుండి బుట్టినందువలన - జాతవేదాః అను శబ్దార్థము ద్వారాకూడ 'భారతి' యననేమో తెలియుచున్నది.

*అగ్నిర్వై భరతః సవైదేవేభ్యోహవ్యం భరతి। (కౌ బ్రా)*
*ఎష (అగ్నిః) హిదేవేభ్యో హవ్యం భరతి తస్మాద్భరతోఽ*
*గ్నిరిత్యాహుః (శ. బ్రా)*

కర్మానుష్ఠాన సమయమున నగ్ని హవ్యవాహనుడు-లేక హవిర్భర్తయగుచు భరతుడగుచున్నాడు. ఆ యగ్ని యొక్క దీప్తి - తదనుగతమై ఇడారూపమున నుండెడి వాక్కు - భారతియగుచున్నది.

*సరస్వతీవాన్ భారతీవాన్ ఇతి వాగేవ సరస్వతీ*
*ప్రాణో భరతః (ఐ. బ్రా)*
*శరీర భరణ హేతుత్వాత్ ప్రాణోభరతశబ్ద వాచ్యః,*
*తదీయవృత్తిర్భారతీ -(సా. భా.)*

ప్రాణరూపుడై యగ్ని దేహమును ధరించునట్లు, ఆధిదైవికముగ వాయు రూపుడై జగత్ప్రాణ శబ్దవాచ్యుడై భువనముల భరించుచున్నాడు. కాన వాయ్వాది శబ్దవాచ్యమగు మధ్యమస్థాన (ప్రాణదేవత) భరతుడు అగుచున్నాడు. ఇట్టి భరతుని వృత్తి, దీప్తి, వాక్కు లేక పత్ని 'భారతి' యగును.

భరతరూపులగు నీ అగ్ని-వాయు-ఆదిత్యులు క్రమముగ పృథివ్యంతరిక్ష ద్యులోకములందు తమ రేతస్సును (తేజస్సును) నింపుచున్నారు. ఆ తేజస్సునే 'భారతీ' యని, 'సంధ్యా' యని యందురు.

*'భారతీ వ్యాహృతి స్సంధ్యా' (లలితాసహ స్రం)*

ఆ భారతిని లేక సంధ్యను ఆరాధించువారు 'భారతీయు' లగుచున్నారు.

*భాయాంశ్రీవిద్యాయాంరతాః - భారతాః*
*భారత్యాః ఉపాసకాః - భారతాః (సౌందర్యలహరి)*
*భరతాత్ ఆగతా - భారతీ*
*భరతస్య ఇయం - భారతీ*
*భారం వేదవిజ్ఞానసారం తనోతీతి - భారతీ*

భరతులని పిలువబడు అగ్ని-వాయు-ఆదిత్యులనుండి వచ్చినదియు, వారి దీప్తియు (రేతస్సు) వేదవిజ్ఞాన సారమును వ్యాపింపజేయునదియు, వరేణ్యమునగు భారతిని ధ్యానించుటయే గాయత్రీమంత్రార్థము. ఆ భారతీ ఉపాసకులే భారతీయులు.

**ధాత్రీ - తులసీ :-**
ధాత్రీ యనగా ఉసిరిచెట్టు

*ధాత్రీస్యాదుపమాతాపిక్షితిరప్యామలక్యపి (అమరకోశః)*
*త్రిలింగ్యామలకీ శివా (వైజయన్తీ) దధాతీతి - ధాత్రీ*
ధరించునది, పోషించునది ధాత్రి

*శంకరోతీతి - శివా*

మంగళమును (క్షేమమును, ఆరోగ్యమును) ఇచ్చునది గాన ఉసిరిచెట్టుకు 'శివా' యని పేరు.

*సుగంధాశ్వేత సురసాభారతీ తులసీ శివా (వైజయన్తీ)*

దీని ద్వారా తులసియును 'శివా'యని పిలువబడుచున్నదని తెలియుచున్నది. తులసీ అనేక వ్యాధులకు దివ్యౌషధము. దీనినుండి వచ్చు గాలియు రోగనిరోధకము. గావుననే ప్రతి ఇంటియందును తప్పక తులసియుంటుంది. భారతీయులు నిత్యము మంగళములనిచ్చు తులసిని గొలుచుట మనమెరిగినదే. ఇంకను-

*యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతాః ।*
*యదగ్రే సర్వదేవాశ్చ తులసి త్వాం నమామ్యహమ్ ॥*

ఈ చెట్టు మొదట తీర్థములన్నియు యుండుట ఈ చెట్టునాశ్రయించి సర్వదేవతలు యుందురు. తులసివనమునకు 'బృందావన'మని పేరు. ఇట సంచరించును గావున 'బృందావనాన్త సంచారీ' యని కృష్ణునకు పేరు.

జగన్మాతకు కూడ 'శివా' యని పేరున్నది.

*శివాభవానీ రుద్రాణీ శర్వాణీ సర్వమంగళా*

మంగళ కారిణియగు జగన్మాతను, తులసిని, ధాత్రిని ఈ కార్తీక మాసమున తప్పక అందరు యారాధించవలెను.

*సువర్ణమణిముక్తాభైరర్చనస్యా ప్రయాత్ఫలమ్।*
*తీర్థాని మునయోదేవా యజ్ఞాస్సర్వేపికార్తికే ॥*

*నిత్యం ధాత్రీం సమాశ్రిత్య తిష్ఠన్త్యర్కే తులాస్థితే ।*
*ద్వాదశ్యాం తులసీ పత్రం ధాత్రీపత్రంతు కార్తికే ॥*

కార్తీక మాసమున యజ్ఞములను గాని, గంగాది పవిత్ర, తీర్థ సేవనమును గాని, దేవతారాధన గాని ఏది చేసినను సువర్ణము చేతను, మణులు, ముత్యముల చేతను చేయబడిన పూజాఫలమునొందెదరు.

(సశేషం)

# గురుశిష్య సంబంధం

(గతసంచిక తరువాయి)

డా శ్రీ తిరుమల రామచంద్ర

*చేష్టతి చ చికీర్షన్ తచ్ఛక్తివిషయే*
గురువు చేయవలసిన పనులు శిష్యుడు తానుచేయగలిగి వుంటే, ఆపనిని చేస్తానని తానే తన ఇష్టంప్రకటించాలి. గురువు చెబితే చేద్దాంలే అని అనుకోరాదు.

*ప్రేషితః తదైవ ప్రతి పద్యేత.*
గురువు తనను ఎక్కడికైనా పంపితే, వెంటనే వెళ్లడానికి సిద్ధంగా వుండాలి.

*ఉచ్చైస్తరాం నఆసీత.*
గురువు ఎదుట ఉన్నతాసనంలో కూర్చోరాదు. సర్వతః ప్రతిష్ఠితే ఆసీత. నేలమీద అంతటా సమానంగా పరచిన ఆసనాల మీద (చాప, కంబడి మొదలయినవి) కూర్చోవాలి.

*శయ్యాసనేచ ఆచరితే నసంవిశేత్.*
గురువు కూర్చొనే పక్కమీద ఆసనం మీద తాను స్వయంగా కూర్చోరాదు.

*యానం ఉక్తః అధ్వని ఆరోహేత.*
దారిలో ఏదైనా వాహనం మీద కూర్చోవలసి వస్తే, గురువు చెప్పిన మీదట కూర్చోవాలి.

*సభానికష కటప్ర స్తరాంశ్య.*
సభలలోను బల్లలు, పీటలు, చాపలు, పరిచిన వాటిపైన గురువు చెప్పిన తర్వాతనో, సైగ చేసిన తర్వాతనో కూర్చోవాలి.

*వ్యుపతోద, వ్యుపజాప, వ్యభిహాస ఉదామంత్రణ, నామధేయ గ్రహణ, ప్రేషణానా ఇతి గురోర్వ్వర్జయేత్.*
గురువు దేహం నొక్కుతూనో, గోకుతూనో సైగ చేయడం, చెవిలో గుసగుస లాడడం, ఎగతాళి చేయడం, పెదగా పిలువడం, పేరుతో పిలువడం, పనికి పంపడం, - వీటిని గురువు విషయంలో వదలి పెట్టాలి.

*ఆపది అర్థం జ్ఞాపయేత్.*
కాని శిష్యుడు ఏదైనా ఆపదలో వుంటే పైన పేర్కొన్న సంకేతాలతో తన అభిప్రాయాలు సూచించవచ్చు.

*స్థానాసన చంక్రమణ స్మితేషు అనుచికరన్.*
నిలబడటం, కూర్చోవటం, తిరగడం, నవ్వడం వీటిలో శిష్యుడు ముందుండరాదు, మొదటా చేయరాదు తర్వాత చేయాలి

*సన్నిహితే, మూత్ర పురీష వాత కర్మో చ్ఛైర్భాష హాస క్షీవన దంత స్కవన నిఃశృంఖణా భ్రూక్షేపణా తాలన నిష్ఠ్యాని నకుర్యాత్.*
గురువు సమీపంలో మూత్రించడం, పురీషం వదలడం, అపానవాయువు వదలడం, పెద్దగా మాట్లాడడం, పెద్దగా నవ్వడం, ఉమ్మివేయడం, పళ్ళు పీకవెయడం, ముక్కు చీదడం, బొమలు ఎగురవెయడం, తాళం వేయడం, చిటికలు వేయడం -ఇలాటి పనులు చేయరాదు

*వారే ప్రజాయాంచ ఉపస్పర్శన భాషాః విస్ర భపూర్వాః వర్జయేత్.*
గురువు దగ్గర తనభార్యా పిల్లలతో సంబంధం పెట్టుకోడం, వాళ్లతో మాట్లాడుతూ వుండడం తగదు

*వాక్యేన వాక్యస్య ప్రతిఘాతం ఆచార్యస్యవర్జయేత్ శ్రేయసాంచ.*
గురువు మాటలుకు అడ్డుతగిలి మాట్లాడరాదు. అలాగే పెద్దల మాటలకు కూడ మధ్యన అడ్డుతగుల రాదు.

*ఆసనే శయనే భక్ష్యైభోజ్యైవాససివా నిహీన తరవృత్తిః స్యాత్.*
కూర్చోవడం, పడుకోడం, బక్ష్యభోజ్యాలు, ఉడుపులు-విషయంలో గురువు కన్నా తక్కువగా ప్రవర్తించాలి.

*గురోస్తు చక్షుర్విషయే నయథేష్టాసనోభవేత్ - మనుస్మృతి అ - 1*
గురువు కళ్లెదుట ఇష్టం వచ్చినట్టుగా కూర్చోరాదు:సభ్యతతో కూర్చొవాలి.

*నోదాహరే దస్యనాను పరోక్షమపికేవలమ్.*
పరోక్షంలోను గురువు పేరుు విడిగా-చెప్పరాదు. దానికి గౌరవవాచకాలు తగిలించాలి.

*నచైవాస్యాను కుర్వీత గతిభాషిత చేష్టితం.*
గురువు నడకను, మాటతీరును,- అంగాంగ -చేష్టలను అనుకరించరాదు.

*ఉపక్రమేవసానేచ చరణౌ శిరసా నమేత్-భాగవతం-స్కంధ-౭-౧౨-3*
చదువు ప్రారంభంలోను, చివరిన గురువు పాదాలకు 'తలొగ్గినమస్కరించాలి.

*బాలే సమవయస్కే వాధ్యాపకే గురువచ్చరేత్-స్మృత్యర్థసారం.*
గురువు తనకన్నా వయసులో చిన్నవాడయినా, సమానవయస్కుడైనా, గురువు పట్ల సగౌరవంగా ప్రవర్తించిన విధంగానే ప్రవర్తించాలి.

*గురూక్తం పరుషంవాక్యం ఆశిషంచింతయేత్-చిదంబరరహస్యం (శివే)*
గురువు పరుషంగా మాట్లాడినా ఆశీర్వాదంగా భావించాలి.

*తేనసంతాడితోవాపి ప్రసాదమితి సంస్మరేతే.*
గురువు కొట్టినా, అది ఆయన అనుగ్రహమని భావించాలి.

*అభిమానో నకర్తవ్యో జాతివిద్యాధనాదిభిః*
జాతి, విద్య, ధనం మున్నగు వాని విషయంలో - తన జాతి గొప్పదని,. తన విద్య గొప్పదని, తాను ధనవంతుడినని గర్వపడరాదు.

*నవియోగం గురోర్దద్యాత్ యుష్మదానైవభాషయేత్.*
గురువుకు పని చెప్పరాదు; ఆజ్ఞలివ్వరాదు నీవు నీవు అని సంబోధించరాదు.

*ఋణదానం తథాదానం వస్తూనాం క్రయవిక్రయం, నకుర్యాద్ గురుభిస్సార్ధం తదాజ్ఞాం నైవలంఘయేత్.*
గురువుకు అప్పివ్వడం అతని వద్ద అప్పు పుచ్చుకోవడం, వస్తువులు అమ్మడం, కొనుగోలు చేయరాదు. గురువు ఆజ్ఞ మీరరాదు.

*ఛాయా భూమి పరిత్యాగే తిష్ఠేత్ శ్రీగురుసన్నిధౌ.*
తన ఒంటినీడ పడేమేర స్థలం వదలి గురువు వద్ద కూర్చోవాలి. గురువు కూర్చునేటపుడు అంతమేర స్థలం వదలాలి. మూడనాలుగుమూరల దూరంలో కూర్చోవాలి.

*ఏకాసనే నోపవిశేద్ గురుణా తత్సమైస్సహ.*
గురువుకు, గురువుతో సమానులయిన వారికి సమానంగా ఒకే ఆసనంపైన కూర్చోరాదు.

*గురుంనామ్నా నభాషేత జపాద్ శ్రాద్ధాదృతేఽపియే.*
జపశ్రాద్ధాలలో తప్ప గురువును పేరుతో పిలువరాదు.

*గురుణాచైవ నిర్బంధో నకర్తవ్యః కదాచన.*
గురువుతో ఎప్పుడూ ఏవిషయంలో నైనాసరే పట్టుదల చూపరాదు.

# శ్రీ సంతోషిమాతాస్తోత్రమ్

- హరి నాగేశ్వర శర్మ, సూర్యాపేట

1. శ్రీ పుష్పగిరి పీఠసశారదాం భారతీం శివాం ।
విద్యామభినవో ద్దండాం ప్రణమామహె శర్మణే ॥

2. శ్రీపుష్పగిరి పీఠవాసిభిః శ్రీజగద్గురు శంకరైః ప్రతిష్ఠితాం।
సర్వపాపశమనీ మభయ ప్రదాంభావయేచ జననీం సుఖదాత్రీం॥

3. సంతోషీం గణనాథమానససుతాం త్రైలోక్యరక్షాకరీం।
సరై ్వశ్వర్య కరీం రిపుక్షయకరీం త్వాంనౌమి బింబాననామ్॥

4. శ్రావణేమాసి పౌర్ణమ్యాం జాతాం త్రిపురసుందరీం।
సంతోషదాయినీం నిత్యం నౌమిత్వాం సర్వమంగళాం॥

5. సరై ్వశ్వర్యమయీ సదాశివమయీ మాయామయీశ్రీమయీ।
నిత్యానందమయీపరాత్పరమయీజ్యోతిర్మయీ చిన్మయీ।
యోగానందకరీరిపుక్షయకరీ మాతాకృపాసాగరీ।
సాక్షాన్మోక్షకరీ శివేత్రినయనీ మాంపాహిసంతోషిమా॥

6. నిపుణైరుచ్యతే నిత్యం సంతోషమరంబలం।
శేషంచపూరయేత్సరై ్వః శ్రీమాతాసేవనాదిభిః॥

7. యత్రైవయత్రైవమనోమదీయం తత్రైవ తత్రైవ తవస్వరూపం।
యత్రైవయత్రైవ శిరోమదీయం తత్రైవ తత్రైవ పదద్వయంతే॥

*(ఆదిశంకరుల రచన)*

8. సమందహసితేక్షణా సకుంకుమ విలేపనా।
సహేమ ప్రభా నతాంగీ సమాతనోతుమ మంగళం శివా॥

9. నమామవేదమాతరంసదాసమృద్ధితోషదాం।
మహాతపస్సమాధిగోచరామనన్యమోక్షదాం।
అశేషజనమోహినీమరుణమాల్యభూషాంబరాం।
సమందహసితేక్షణాం త్రిపురసుందరీమాశ్రయే॥

10. నమస్తే నమస్తే శివేలోకమాత్రే
నమస్తే నమస్తే నమస్తే సదానందమూర్తే।
నమస్తే నమస్తే సదాసుప్రసన్నే
నమస్తే నమస్తే నమస్తే నమః॥

11. యాదేవీసర్వభూతేషు ఇచ్ఛారూపేణ సంస్థితా।
యాదేవీ సర్వభూతేషు జ్ఞానరూపేణ సంస్థితా।
యాదేవీ సర్వభూతేషు క్రియారూపేణ సంస్థితా।
సంతోషరూపాసాదేవీ పాతుమాం సర్వమంగళా॥

12. చంపక పంకజ కురవక కుందైః కరవీరమల్లికా కుసుమైః।
పూజిత తవ పాదౌపాలయతాం మాం నిత్యం॥

13 భజేఽహం సుకన్యాం సుదామూర్తి మాద్యాం
నిరీహాం నిష్కలంకాంనిర్వికారాంచనిత్యాం।
రమాంవేదవేద్యాం పరాంకోమలాంగీం
ప్రభారూపిణీం తాం ప్రసీద ప్రసీద॥

14. శ్రీమన్మహేశ్వరికృపామయిహే త్రినేత్రి
హేదేవదేవి గణనాథసుతేమదంబే।
హేపావని కురు కృపాంమయిహే భవాని
నాగేశ్వర ప్రణునుతే శరద శ్శతాని॥

15. రత్నపాదుకా ప్రభాభిరామ పాదయుగ్మకాం
అష్టసిద్ధి దాయకాంచ భక్తవత్సలాం।
నిక్వణన్మనోజ్ఞ హేమకింకిణీలసత్కటీం
మాతరం భజేఽహమీప్సితార్థదాయకామ్॥

16 అవినయ మపనయ మాతః దమయమనశ్శమయ
విషయమృగతృష్ణాం।
భూతదయాం విస్తారయ సంతోషిమాం తారయ నిత్యమ్॥

17. సంతోషీనిత్యకల్యాణీ భానుపుర్యాం ప్రతిష్ఠితా।
విధత్తాం మానసోల్లాసం సర్వేషాం పురవాసినామ్॥

18. నజానామి నాన్యాం మదంబాం సంతోషిరూపాంత్వాం వినా
నజానామి క్రియామిహాన్యాంవినాత్వత్పాదసేవనమ్॥

19. సంతోషీనిత్య కన్యామాం సర్వానర్థనివారణీ।
కామితార పదావంద్యా కల్యాణీ పాతుమంగళా॥

20. నమోనిత్య శుద్ధా నమో నిర్వికల్పా
నమో విప్రరూపా నమో విద్రుమాభా।
వామదేవీ
నమో ముక్తిదాత్రీ నమస్తేనమః॥

21. మందారమల్లీకరవీరమాధవీ పున్నాకనీలోత్పల చంపకాదిభిః।
పుష్పైశ్చ సర్వైః పరిపూజితాంఘ్రీ సంతోషిరూపేశరణం ప్రపద్యే॥

22. నాగేశ్వరేణ పుత్రేణ సీతారామ స్వసంతతం।
సర్వాభీష్ట ప్రదం నిత్యం రచితం స్తోత్రముత్తమం॥

23. యః పఠేద్యశ్చశృణుయాత్ స్తోత్రం సధ్యానపూర్వకం।
సోఽవాప్నోతిదయాంమాతుః సంతోష్యాః సుఖశాంతిదాం॥

# దివ్యయోగి చరితామృతం-
# కడప అవధూతేంద్రులు

*- ఆచార్య బి. రామరాజు*

*(గత సంచిక తరువాయి)*

అవధూతేంద్రులు దీన్‌సాహెబు కాకాహోటల్లో మిరపకాయబజ్జీలు, వట్టి మిరపకాయలు రుచిగా తినేవారు. కుతకుత ఉడికే షోర్వా గిన్నె ఎత్తి నీళ్ళవలె త్రాగేవారు. పెనంపై కాలే చపాతీ చేతితో ఎత్తి అట్లాగే తీసుకుంటూ పోయేవారు. ఇతరులకోసం ఉంచిన ఉపాహారాలు ఎంగిలి చేసి తినగా మిగిలినవి చల్లి అందరూ తినే ప్రదేశం నానా కంగాలీ చేసి ఓర్పును పరీక్షించేవారు. జనులు సహించకపోయినా ఆదరించే దీన్‌సాహెబు, తండ్రిగా భావించే లక్ష్మణయ్యర్, చుట్టలు సిగరెట్లు భక్తితో సమర్పించే హోటలు కొండయ్య స్వామి పరీక్షలకు తట్టుకొని నిలిచిన గీటురాళ్ళు. అందుకే బుగ్గవంక వరదల్లో కొట్టుకొనిపోకుండా దీన్‌సాహెబు సంపదను స్వామి కాపాడినారు. 1953-1954లో ఒక సంధ్యాసమయాన తనకు తేనీరిస్తున్న దీన్‌సాహెబు చెక్కిలిపై చేయివేసి 'ఫా' అంటూ హోటలు బయటకు తోసినారు. సాహెబుకు అర్థంకాలేదు. బయటకు వచ్చి చూస్తే బుగ్గవంక పొంగి రావటం కనబడింది. ఒక్క పరుగున గల్లాపెట్టె ముఖ్యమైన సరుకులు నడుముబంటి నీటిలో దాట వేసుకున్నారు. స్వామి కంఠదఘ్నంగా నీటిలో నిలిచియేఉన్నారు. ఒకనాటి వేకువజామున అదే హోటలు ముందు చుట్ట త్రాగుతూ కూర్చున్న స్వామి హఠాత్తుగా లేచిపోయి వంటశాలలో మరిగే పాలపాత్రను కాలితో దొర్లించినారు. 20 శేర్ల పాలు నేల పాలైనవి. కాఫీ, టీల కోసం వచ్చినవాళ్ళు పిచ్చివాణ్ణి నెత్తినెక్కించుకున్నందుకు సాహెబును తూలనాడినారు. సాయెబు పాలపాత్ర లేవనెత్తి చూస్తే అందులో ఎప్పుడో పడి చనిపోయిన పందికొక్కు కనబడింది. తొందరపడి తూలనాడినవాళ్ళ నోళ్ళు మూతపడినవి. 1958లో బుగ్గవంక వరదలు స్వామికి మోకాలిబంటి మాత్రమే.

అవధూతేంద్రులకు చాలాకాలం పరిచర్య చేసిన భక్తుల్లో పోలు సుబ్బారెడ్డి ఒకరు. సుబ్బారెడ్డి మనసులోని కోరికను పసిగట్టిన స్వామి ఆతని రొమ్ముపై తట్టినారు. వెంటనే ఆతని నాలుక వెనుతిరిగి, ఊర్ధ్వ కుహరంలోనికి చొచ్చుకపోయింది. ఆతనికి ఖేచరీవిద్య కరతలామలకమైనది. శారీరక హింస ఓర్చి ఎంతో కాలం సాధన చేయవలసిన ఈవిద్య స్వామి కరస్పర్శచేత క్షణకాలంలో సాధ్యమైపోయినది. ఇంకొకసారి సుబ్బారెడ్డి స్వామి సన్నిధిలో

ఉండగా తన సూక్ష్మ శరీరం కనబడింది. ఎంతో తపస్సంపన్నులైన వారికి మాత్రమే అది సాధ్యం.

అవధూతేంద్రుల కామగమనం పలువురికి అనుభవం. బస్సు ప్రయాణం చేసేవారికి తమకంటె ముందుగానే ఆయా ఊళ్లలో కనపడి తిరిగివారు తమ స్వస్థానాలకు చేరేవరకు అక్కడా దర్శనమిచ్చేవారు. వాయువేగం మనోవేగం మహనీయుల సంకల్పం తరువాతివే! పాతబస్ స్టాండువద్ద కూర్చున్నస్వామికి కదిరిబస్సుపైకి సామానులెక్కిస్తున్న దస్తగిరి సాయెబు కాలుతగిలింది. స్వామి కోపంతో 'ఫో నీయమ్మ' అంటూ దూరం జరిగిపోయినారు. డ్రైవరు సాయెబు క్షమాపణ చెప్పి నమస్కరించి బస్సు ఎక్కి గిద్దలూరు ప్రయాణమైపోయినారు. 45 కి.మీ. పోయిన తరువాత వనిపెంట దాటిపోతుండగా స్వామి తమకంటెముందు నడచిపోవటం గమనించి తన కన్నులను నమ్మలేక బస్సు ఆపి స్వామిని ఎక్కమన్నారు. స్వామి నిరాకరించి సాగిపోయినారు. బస్సు చాలా దూరం పోయి మల్లెపల్లి చేరింది. ప్రయాణికులను దింపి కడపకు తిరుగు ప్రయాణమైనది. స్వామి మల్లేపల్లి దర్గావద్ద తారసపడ్డారు. బస్సు కడప చేరింది. దస్తగిరి సాయెబు తన ఈ అనుభవం దీనుసాయెబుకు చెప్పటానికి కాకాహోటలుకు పోతే స్వామి అక్కడే నిలుచున్నారు. దీన్ సాయెబు స్వామికి చుట్ట వెలిగిస్తుండటం చూచి దస్తగిరి నిశ్చేష్టుడైనాడు. స్వామి ఒకేసారి పలు తావుల్లో కనబడే ఈ అనుభవాలు సర్వ తిరిపెం (DSP), కుప్పుస్వామి (BDO), గుంటి లక్ష్మణరావులకు (Constable) కలిగినవి.

అవధూతేంద్రుల మహిమలు తొట్టతొలుత గ్రహించినవారు కడప వన్‌టౌన్ ఎస్.ఐ. I.P. రామయ్య. రాత్రి గస్తీకి బలగంతో బయలుదేరిన రామయ్యకు పోలీస్‌స్టేషన్ మెట్లవద్ద దిగంబరంగా పడుకున్న బిచ్చగానివలె స్వామి దర్శనమైనది. అపశకునంగా భావించి లోపలికి తిరిగిపోయి కాసేపటికి మరల బటలుదేరినారు. దిగంబరి అట్లాగే అడ్డంగా పడుకొని ఉన్నారు. విధి నిర్వహణలో వెనుకముందాడటం ఇష్టంలేని రామయ్య తానై వైదొలగి కడపకు నైఋతిగా నేరజాతులవారుండే మరియాపురం పోతుండగా బుగవంక మోకాలుబంటి ప్రవహిస్తున్నది. అది దాటుతుండగా కంఠంవరకు నీటిలో వెలుగులు చిమ్ముతున్న స్వామిని టార్చిలైటు వెలుగులో చూచి అతడే ఇతడా అనే శంకతో వెంటనే వెనుదిరిగి మరల పోలీస్‌స్టేషన్ చేరినారు, దిగంబర యోగి ఎప్పటివలె మెట్లపై పడుకొని ఉన్నాడు. ఒకేసారి రెండుచోట్ల దర్శనమిచ్చిన అతడు మహాయోగి కామరూపుడు కామగామి అని రామయ్య

గుర్తించినాడు. నాటినుండి స్వామికి భక్తుడైనాడు. ఒకసారి రామయ్య తలుపు వేసుకొని పడుకుంటే అర్ధరాత్రి అవధూతేంద్రులు లోపల ప్రవేశించి రామయ్యను తట్టిలేపి "మీ మేనమామకు బాగాలేదు తక్షణం బయలుదేరి ద్రోణాచలం వెళ్ళు"మని ఆజ్ఞాపించినారు. రామయ్య టాక్సీలో ద్రోణాచలం చేరేసరికి స్వామి అక్కడ ఆయన మేనమామకు చికిత్సచేస్తూ దర్శనమిచ్చినారు. స్వామికి రామయ్య పూలదండ తెప్పించేలోగా అదృశ్యులైపోయినారు. తన భక్తుని ఆపత్సమయంలో ఆదుకున్న కారుణ్యమూర్తి కడప అవదూతేంద్రులు.

మొండి భక్తుల సహనశక్తిని స్వామి పరీక్షించేవారు. వారేమైనా తినిపించటానికి వస్తే బూతులు తిట్టేవారు, కొట్టేవారు. స్వామి పరీక్షకు తట్టుకోలేక తిరిగి పోయినవాని గతి అంతే! తట్టుకుంటేమాత్రం ధారాపాతంగా అనుగ్రహం వర్షించేవారు. స్వామిని అర్ధంచేసుకున్నామనేవారుకూడ ఇట్టిపరీక్షలకు చికాకు పడేవారు. తరువాత పశ్చాత్తాప పడేవారు. అందుకే అన్నారు అందరూ సాధారణులైతే అవధూతలు అసాధారణులు అని!

నిజమైన భక్తురాండ్ర చెంత అవధూతేంద్రులు పసిబిడ్డ గారాబం చేసేవారు. స్వామి చెర్లోపల్లిలో ఉండిన దినాల్లో మోపూరి చెన్నారెడ్డి భార్య రాములమ్మదే ఆతిథ్యం. ఆమె చేసి ఇచ్చిన జొన్నరొట్టెను నెలదినాలు తిని స్వామి ఆమె ఇంటనే ఎక్కువ సమయం గడపినారు. ఒకనాడామె ఉప్మా చేసిపెడితే స్వామి తిననంటూ గోడకు చేరగిలబడ్డారు, రాములమ్మ చాలాసేపు బతిమాలి స్వామికి ఉప్మా తినిపించింది. ఆమె స్వామికి చాలా శుశ్రూషచేసింది. ఐనా ఆమెను కూడ స్వామి పరీక్షించేవారు. స్వామినీరు పుక్కిలించి ఆమె ముఖంపై ఉమిసినారు. అది స్వామి అనుగ్రహవర్షంగా భావించిందామె. స్వామి ఇటు చెర్లోపల్లెలోను అటు కడపలోను ఏకకాలంలో నివసించినారు.

అవధూతేంద్రులకు అనుదినం పొగాకు చుట్టలిచ్చే పాలవ్యాపారి వాసుదేవరెడ్డికి విధి వికటించి పేదరికం ప్రాప్తించింది. ఆస్తులన్నీ పోయినవి. ఒకనాడు యథాప్రకారం వచ్చి రెడ్డి తన కష్టాలు చెప్పుకుంటుంటే స్వామి అనుకోని విధంగా ఆతని చేతిలో ఒక పొగాకు చుట్ట పెట్టినారు. రెడ్డి ఆచుట్టను మహాప్రసాదంగా ఇంట్లో భద్రపరచుకున్నాడు. చుట్టయిల్లు చేరినప్పటి నుండి రెడ్డికి దశ తిరిగింది. క్రమంగా పూర్వం కంటే ఐశ్వర్యవంతుడైనాడు. ఆ చుట్ట ఇప్పటికీ రెడ్డి ఇంట్లో లక్ష్మీకటాక్షంగా నిల్చిఉంది.

కడప తాలూకాఫీసు దఫేదారు కుంభగిరి కృష్ణప్ప స్వామికి అప్పుడప్పుడు

చుట్టలిచ్చే భక్తుడు. అతనికి హృదయ స్థానంలో ఎదో అవరోధం. దగ్గితే రక్తం పడేది. స్వామి తాగి పారవేసిన చుట్టముక్కలు ఏరుకొని ప్రసాదంగా కృష్ణప్ప త్రాగనారంభించినాడు. పొగత్రాగితే ఎక్కువకావలసిన హృద్రోగం తత్ఫలితంగా పూర్తిగా నయమైనది. ఆంధ్రజ్యోతి ఏజెంటు బూసం సుబ్బన్నకు ఎడమచేయి సలుపుతూ బాధపెట్టేది. ఏమందులూ పనిచేయలేదు. స్వామికి శరణాగతుడై చుట్ట ఇవ్వబోతే "రేపురాఫో" అన్నారు. మరునాడు పోతే "ఫో, మళ్ళీ రాఫో" అన్నారు. మూడవనాడు పోతే "ఫో, నీయమ్మ సొళ్ళ" అంటూ భుజానికీ కంఠానికీ మధ్య ఈడ్చి కొట్టినారు. దిమ్మతిరిగి పడిపోయిన సుబ్బన్నకు ఆక్షణంనుండి చేయి తీపు లేదు. పంచముడు రోశయ్య కల్లుత్రాగి పోతూ త్రోవలో ఎదురుపడ్డ అవధూతేంద్రులకు నమస్కరించినారు. స్వామి అతని చొక్కా పట్టి లాగి చేతులు చాచి ఆరువేళ్ళు చూపి "ఫో" అన్నారు. ఆనాటినుండి రోశయ్య చొక్కా ధరిస్తే కుచ్చుకున్నట్లయ్యేది. క్రమంగా త్రాగుడు మాని సత్ప్రవర్తన అలవరచుకున్నాడు. స్వామి స్పర్శలో అతనికి సాత్త్వికగుణం అలవడింది. బట్టలకొట్టులో పనిచేసే సుబ్బారాయుడు స్వామిభక్తుడు, కోర్టు వ్యాజ్యంతో కష్టపడుతూ మనసులోనే పరిష్కారం కోరుతూ స్వామిని దర్శించి నమస్కరించినాడు. స్వామి అతని వీపుపై కాలితో తన్ని త్రోసివేసినారు. దెబ్బ తగలకపోగా అతడు కోర్టు వ్యాజ్యం గెలిచినాడు. మహాకవి పుట్టపర్తి నారాయణాచార్యులు భార్య కవయిత్రి కనకమ్మ స్వామికి చిత్రాన్నం వండుకొని పోయింది. జూనియర్ కాలేజి వద్ద నిల్చిన స్వామి పిడికెడు చిత్రాన్నం తిని "ఇట్లా ఫో" అని వేరొక మార్గం చూపినారు. ఆమెకర్థం కాక వచ్చిన దారిన పోబోతుంటే స్వామి కోపంతో ఆమె మెడపట్టి తాము నిర్దేశించిన మార్గానికి నెట్టివేసినారు. ఆమె అట్లాగే పోయి బ్రతికింది. ఆమె పోదలచిన బాటలో అదే సమయాన బస్సు-ప్రమాదం జరిగింది. స్వామి ఆమె గండం తప్పించారన్నమాట. అవసరమైతే స్వామి శిష్టరక్షణకు దుష్ట శిక్షణకు బలప్రయోగం చేసేవారు. స్వామి పాతబస్‌స్టాండ్ వద్ద ధ్యానంలో ఉండగా సమీపంలో కూర్చున్న యువతి తువ్వపల్లె లక్ష్మీనరసమ్మపై ఒక త్రాగుబోతు అత్యాచారానికి పాల్పడ్డాడు. ఆమె స్వామిని ప్రార్థించింది. స్వామి లేచిపోయి త్రాగుబోతుకు దేహశుద్ధి చేసి ఆమెకు రక్షణ, ఊరట కల్పించినారు.

షిర్డీ సాయిబాబా, మౌనస్వామి వంటి సత్పురుషుల చరిత్రల్లో ఖండయోగం గురించి ఉన్నది. వారివలె కడప అవధూతేంద్రులు కూడ ఖండయోగం చేసేవారు. కడప వన్‌టౌన్ సబ్-ఇన్స్పెక్టర్ రామమూర్తి ఒకనాడర్ధరాత్రి కుతూహలంతో స్వామిని అనుగమిస్తూ పురపాలక పాఠశాల

వెనుక తుమ్మ చెట్లవరకు పోయినాడు. పది అడుగులు ముందున్న స్వామి ఆగిపోయినారు. స్వామి శరీరావయవాలు విడివడిపోయి గాలిలో తేలుతున్నది. ఈ ఖండయోగం అర్థంకాక గుండెలు జారిన రామమూర్తి వెనక్కు తిరిగి వచ్చినాడు. దీన్ సాహెబు హోటలువంటమనిషి బషీర్ తెల్లవారు జామున దేహబాధ తీర్చుకోవటానికి పాఠశాల వెనుక పెరడులోనికి పోతే అక్కడ ముక్కలై పడియున్న స్వామి శరీరం కనపడింది. భయభ్రాంతుడైన బషీర్ పరుగెత్తిపోయి దీన్‌సాయెబుకు చెప్పినాడు. ఇద్దరూ వచ్చి చూచి పోయి దిగులుగా కూర్చుండగా స్వామి వచ్చి దీన్‌సాయెబు టేబుల్ ఎదుట ప్రత్యక్షమైనారు. భవనాలు రహదార్లశాఖలో అటెండరు తలపాకుల రామయ్యకు ఇటువంటి దృశ్యమే ఒకసారి కనపడింది.

పాంచ భౌతిక శరీరం అవధూతేంద్రుల ఇష్టానుసారమే ప్రవర్తించినా ఒక్కొక్కసారి సాధారణ మానవులనుభవించే వ్యాధులూ ప్రమాదాలూ వారికి తప్పలేదు. ఒకసారి వారి శరీరంపైనుండి లారీ దూసుకుపోతే శరీరం చితికిపోయింది. అది క్షణకాలం మాత్రమే. మరల యథాప్రకారం సశరీరులుగా రఘోత్తమరావుకు దర్శనమిచ్చారు. స్వామిచేతులకు కాళ్ళకు గాయాలైనా చూచేవారికే బాధకాని స్వామికి ఏమాత్రం బాధలేనట్లుగా కనబడేవారు. లక్ష్మణయ్యర్ స్వామి ఫోటో తీయించటానికి ప్రయత్నిస్తే స్వామి తప్ప మిగతా దృశ్యమంతా పడింది. హిందూ పత్రికావిలేఖరి వి.ఆర్. గోపాలకృష్ణ అనుభవం కూడ ఇటువంటిదే. వారి అనుమతి లేకుండా వారి ఛాయాచిత్రం తీయడం అసాధ్యం. కలెక్టర్ వాహనం నిలిపేచోట ఒకసారి స్వామి కూర్చుండగా కలెక్టర్ సయ్యద్ మహమ్మద్ ఆయనను తొలగింపజేసి కొన్ని గజాలు ముందుకు సాగిపోతే స్వామి మరల యెదుట ప్రత్యక్షమైనారు. ఆశ్చర్యమగ్నుడైన కలెక్టరు వెనుదిరిగి వచ్చిచూస్తే స్వామి మరల యెదుట కనపడ్డారు. ఏకకాలంలో రెండు చోట్ల స్వామిని దర్శించిన కలెక్టరు తన కార్యాలయం ప్రాంగణంలో స్వామిని యెవ్వరూ ఆక్షేపించవద్దని ఉత్తర్వు చేసినారు.

అగ్ని నిర్వాపక దళం సిబ్బంది స్వామిని భక్తిప్రేమలతో సేవించేవారు. వారు ఇచ్చిన సత్తుచెంబును స్వామి అపురూపంగా వాడుకునేవారు. ఆచెంబుతోనే నీరు త్రాగేవారు. ఎవరో చెంబు దొంగిలిస్తే దానికోసం బాధపడ్డారు. సిబ్బందిలో ఒకడు జాన్ స్వామికి చాలా ఇష్టుడు. అతణ్ణి తరుముతూ సరదాగా పరుగెత్తి పడిపోయిన స్వామి చేయి విరిగింది. వైద్యులతో కట్టు కట్టించటానికి స్వామి ఒప్పుకోలేదు. జాన్ మర్దనచేసి సేవచేసినాడు. కొన్నాళ్ళకు చేయి అదే బాగైనది. మరొకసారి స్వామి జారిపడితే కాలు

విరిగింది. స్ట్రెచ్చరుపై తీసుకపోయి శల్యచికిత్స చేసి కట్టుకడుతుంటే నొప్పికి స్వామి బిగ్గరగా 'నారాయణా' అని అరచినారు. ఈనామస్మరణం ఎవరికోసమో! రెండు నెలల విశ్రాంతి అవసరమైనది. భక్తుడు కుంభగిరి కృష్ణప్ప "స్వామి! మీకు కూడ ఇంతేనా?" అంటే "కర్మలేరా! అద్దే ఫో" అన్నారు. కర్మ ఎంతటి వారికైనా తప్పదేమో! చరిత్రల్లో కర్మానుభవం కోసం చాలామంది మహానుభావుల చరమదశలో ఇట్టిపరిస్థితి మనం గమనిస్తాము.

మునుముందు రానున్న అరిష్టాన్ని స్వామి తమ విపరీతచర్యల ద్వారా అప్పుడప్పుడు సూచించేవారు. రాజంపేట భక్తుడు తెచ్చిన అన్నం నాల్గు పిడచలు తీసుకొని స్వామి నాల్గుదిక్కులకు చల్లినారు. కొందరిది అరిష్టసూచకం అనుకున్నారు. అనుకున్నట్లే మరునాడు పత్రికల్లో దివిసీమ తుఫానుఘోరవార్తలు వచ్చినవి.

అవధూతేంద్రులు దీన్‌సాయెబు హోటల్లోనికి అర్ధరాత్రి దాటిన తరువాత ప్రవేశించి లోపలికి పోయేవారు. లోపల ఏమి చేస్తారో అనే కుతూహలంతో నాలుగవనాడు సాయెబు రహస్యంగా అనుగమించినాడు. వంటగదిలో కాలుపైకాలు వేసికొని పడుకున్న స్వామి చుట్టూ బారెడు నాగుబాము ప్రదక్షించి పాదాలకు పడగ తాకించి వెళ్ళిపోయింది. స్తంభించి చూస్తున్న దీన్‌సాయెబును స్వామి పిల్చి మాట్లాడి పంపివేసినారు. ఆ స్థలమే తరువాత స్వామి సమాధిమందిరమైనది.

కడప సమీపం నాగిరెడ్డి పల్లెలో సాదయ్య సమాధివద్ద అవధూతేంద్రులు (7-3-1978) ఒకనాడంతా గడపినారు. పోలు సుబ్బారెడ్డిస్వామిని కడపకు తీసుకపోతుంటే మధ్యలో బుగ్గపల్లెలో ఒకరాత్రి గడపినారు. మరునాడు కదిరిచేరి, అక్కడ్ నానాహైదర్‌వలీదర్గాలో కొంత సేపుమౌనంగా ఉండి మదనపల్లి రోడ్డుచేరినారు. స్వామి ఆవేళ అన్నమడిగితే రెడ్డి యాచించి తెచ్చేవరకు ఆ ప్రాంతం వదలి ఎంతో దూరం పోయినారు. రెడ్డి వెదకివెదకి బతిమాలి అన్నం తినిపించినాడు. కదిరి మదనపల్లి రోడ్డులో అర్ధరాత్రి దాకానడచి, దారి ప్రక్కసత్రం అరుగుపై స్వామి కూర్చుండి రెడ్డినిలోనికి పొమ్మన్నారు. బయట స్వామి సింహనాదం చేస్తే లోపల రెడ్డి గడగడలాడి పోయినాడు. హఠాత్తుగా రెడ్డి శరీరంలోని మెరుపు రూపు కట్టి ఎదుట తేజస్సుగా నిలిచింది. ఆ వెలుగులో స్వామి ఉగ్రరూపం దర్శనమైనది. ఈ గండాలన్ని గడచి సుబ్బారెడ్డి 16-3-1978 నాడు రాత్రి పదిగంటలకు

స్వామిని కడపకు చేర్చినారు. మహాత్ములు ఒక ప్రత్యేక యోగసాధన చేస్తుంటే వారి శరీరాలు జ్యోతిస్స్వరూపాలుగా మారుతుంటాయి. అవధూతేంద్రుల శరీరాన్ని జ్యోతిః పుంజంగా, జగజ్జనని రాజరాజేశ్వరిగా భక్తులు ఉదయగిరి లక్ష్మీనరసయ్య దర్శించినాడు. స్వామి వద్ద పడుకునే గుండయ్యకు ఒక నిండర్ధరాత్రి మెలకువ కలిగింది. స్వామి పడుకున్న వైపు నుండి గంధర్వగానం వినిపిస్తే అటువైపు తిరిగి చూచినాడు. ఆతనికొక కాంతిపుంజం కనిపించింది.

అవధూతేంద్రులను దూరదూరాలనుండి సత్పురుషులు వచ్చి దర్శించి గోష్ఠిచేసేవారు. బ్రహ్మంగారి మఠంనుండి ఒక యోగి వచ్చినాడు. ఆయనకు ధ్యానంలో స్వామి కనబడి తమవద్దకు రమ్మన్నందున వచ్చి కొంతకాలం ఉండి పోయినాడు. అట్లాగే గోపాలపురం రామయ్య స్వామి, వడమాలపేట శంకరయ్యస్వామి, సమోసాస్వామి, ఎక్కిరాల భరద్వాజ, బదరీస్వామి వంటి మహానుభావులు అవధూతేంద్రులను దర్శించిపోయినారు. అవధూతేంద్రులు జ్ఞానబోధచేసిన ఉదాహరణలున్నవి. భాకరాపేట పెద్దమునెయ్యకు పద్మాసనంలో కూర్చుండి చిన్ముద్రాంకితులై యోగసాధన చేసుకొమ్మని చెప్పకుండా చెప్పినారు. పంచీకరణమంటే ఏమిటో మైసూరుపాకు ముక్కలను అటుఇటుమార్చుతూ అవగతం చేసినారు. చాలాకాలం శుశ్రూష చేసిన పోలు సుబ్బారెడ్డికి కంఠస్పర్శ వం తాకి దివ్యానుభూతి కలిగించినారు. అతని శరీరం చైతన్యం కోలుపోయింది; ద్వంద్వాతీతమైన అలౌకికానందం అనుభవించినాడు. నెమిలిదిన్నె సుబ్బారాయుడనే భక్తుడు స్వామి అనుగ్రహంలో అతీంద్రియ చైతన్యాను భూతి పొందినాడు. అవధూతేంద్రుల కఠినపరీక్షలకు తట్టుకున్న దరాస్వామి, శ్రీకాళహస్తి వెంకటసుబ్బారెడ్డివంటి సాధకులు స్వామి అనుగ్రహానికి పాత్రులైన వారే.

1978 ఏప్రిల్‌లో స్వామికి గవదబిళ్ళలు వచ్చినవి, ఆహారం మానినారు, మాట క్షీణించింది. అట్టి పరిస్థితిలో కూడ కంటిలో పొరవచ్చిన నెలదినాల పసిపాపకు శస్త్రచికిత్స అవసరం లేకుండా కరస్పర్శతో నయం చేసినారు.స్వామి ఆరోగ్యం బాగా క్షీణించటంతో 8-4-1978 శా.శ.1900 కాళయుక్తి ఉగాది శనివారంనాడు స్వామిని కడప ఆసుపత్రిలో చేర్పించినారు. శిష్యులు పోలుసుబ్బారెడ్డి, పాళెంరెడ్డెయ్యలుస్వామికి పరిచర్య చేసినారు 10-4-1978 చైత్రశుద్ధ తదియ సోమవారం ఉదయం 11 గంటల 23 నిమిషాలకు స్వామి అవతారం చాలించినారు. ప్రజలకు దర్శనార్థం స్వామి శరీరాన్ని అగ్నినిర్వాపక కార్యాలయంలో ఉంచివారు. మరునాడు (11-4-1978)

కడప ప్రధాన వీధుల్లో ఊరేగించి మధ్యాహ్నం సమాధి చేసి ఒక రాతి పలకం కప్పినారు. దీన్‌సాయెబు హోటలు వంటగది సమాధి స్థలంగా మారింది పూర్వం అర్ధరాత్రులు స్వామి ఆగదిలో విశ్రమిస్తుండగా నాగుబాము ప్రదక్షిణం చేసి పోయేది. ఆ గదే శాశ్వత విశ్రామధామంగా మారటం విధివిలాసం. ఆలస్యంగా అక్కడకి చేరిన దీన్‌సాయెబు ఒకప్పటి అనుభవం తలచుకొని ఆస్థలం స్వామికర్పితమైనందుకు మహదానందపడ్డారు. ఈనాడాసమాధి పైన ఒకమందిరం వెలసింది. అందులో స్వామి చలువరాతి విగ్రహం ప్రతిష్ఠించినారు. స్వామి ప్రత్యక్షదైవంగా కడపవాసులచేత పూజలందుకుంటున్నారు. కడప చుట్టుపట్టు చెన్నూరు, బలసింగపల్లి, ఉప్పరపల్లి గ్రామాల్లోనేకాక దూరాన నీలకంఠరావు పేట, గండిక్షేత్రం, పులివెందుల, సింహాద్రిపురం, అనంతపురం వంటిచోట్ల కూడ అవధూతేంద్రులకు భక్తులున్నారు. ప్రతిభక్తుడు ఏదోఒక దివ్యానుభూతి వినిపిస్తారు.

సమాధి తరువాత కూడ అవధూతేంద్రులు దివ్యలీలలు ప్రకటిస్తున్నారు. సమాదిచేసిన ఆరుగంటల తరువాత ఆసాయంకాలం తెలుగు పండితుడు నాగమూర్తి మిత్రుడు రామలింగంతో లోకాభిరామాయణం చెప్పుకుంటూ సమాధిని సమీపిస్తేవిచిత్రమైన దృశ్యం కనిపించింది. సమాధిపై అవధూతేంద్రులు దక్షిణాబిముఖంగా చేతులు మోడ్చి కూర్చున్నారు. ఆపాదమస్తకం పూలమాలలున్నవి. ఆయిరువురు ఆశ్చర్యంతో సమస్కరించిపోయినారు. ఈ దృశ్యం రాబోయే పాలరాతి విగ్రహానికి సూచన కాబోలు. కడప ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్ ఎమ్. రఘునాథ్ ఏవోసమస్యలతో సతమతమౌతూ నిద్రపట్టక ఒకనాడు రాత్రి ఇంటి [illegible] అరుగుపై కూర్చున్నారు ఎదురింటి అరుగుపై స్వామి దర్శనమిచ్చినారు. ఒకరికొకరు ఎదురు-నడచినారు. రఘునాథ్‌స్వామి పాదాలంటినాడు. రక్షించాలే ఫో అంటూస్వామి వెళ్ళిపోయినారు. రఘునాథ్ చిక్కులు సూర్యరశ్మికి మంచు తెరలవలె కరగిపోయినవి. గట్టుపల్లి వెంకటసుబ్బయ్య అవధూతేంద్రుల అనన్యభక్తుడు. రాత్రి భోజనానంతరం నీరు పుక్కిలించి ఉమియటానికై ఇంటి బయటికి పోతే కటపాము రెండు చోట్ల కరచింది. ఇంటివాళ్ళు, మిత్రులు ఆసుపత్రికి పోవలెనని బలవంతం చేసినా వినకుండా వెంకటసుబ్బయ్య స్వామి సమాధి మందిరానికి పోయి మ్రొక్కుకున్నాడు. పాము విషం విరిగి పోయింది. సాధారణ మానవునివలె కడపలో అందరి మధ్యన **45** ఏండ్లు మెలగిన స్వామి అవతారసమాప్తి నాటికి అశేష ప్రజానీకానికి గురువై ఆపద్బాంధవుడై ఈనాడు భక్తులు నిర్మించిన జ్ఞానమందిరంలో దైవంగా కొలువుదీరి నిత్య పూజలందు కుంటున్నారు.

*ఆధారం :- అవధూతేంద్రులు* - గండ్లూరినారాయణరావు 1986.

# శ్రీ వల్లభ చరితామృతం

అనే

(శుద్ధాద్వైతదర్శనం)

*మూలం : శ్రీ కళాధరభట్*

*తెలుగు రచన : అక్కిరాజు రమాపతిరావు*

## శ్రీవల్లభ జీవిత సంగ్రహం
(గత సంచిక తరువాయి)

సర్వేశ్వరాచార్యులవారితో ఆయన శిష్యగణమంతా వల్లభుల వారిని ఆచార్యులుగా స్వీకరించింది. ఇక్కడ నుంచి ఆయన వృధినగరం చేరారు. ఈప్రదేశంలోనే శ్రీమంతుడైన ఒక వర్తకశ్రేష్ఠుని కొమారుడైన శ్రీ దామోదరదాసు శ్రీవల్లభుల సమాశ్రయణం పొందటం జరిగింది. తదాదిగా ఆయన శ్రీవల్లభులకు అత్యంత ప్రియమైన శిష్యుడిగానూ, అనుచరులుగానూ పుష్టి మార్గ చరిత్రలో ప్రసిద్ధుడైనాడు.ఈయన్ను ప్రీతితో దామలా గా పిల్చుకుంటారు పుష్టిమార్గులు. ఈవిధంగా వల్లభులు భాగవత ప్రవచనం చేస్తూ, విశిష్టతత్త్వ ప్రతిపాదనం చేస్తూ, అనేక పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ మధ్యమధ్య మహావిద్వాంసులతో తత్త్వచర్చలు చేసి వాళ్ళందరినీ తనమార్గంలోకి త్రిప్పుకుంటూ, తన పాండిత్యాన్ని, వాదకౌశలాన్ని ప్రకాశింప చేసుకొంటూ తమస్వగ్రామం చేరుకున్నారు. పినతండ్రి శ్రీజనార్దనభట్టు, ఆయన ఇతర బంధువులు ఆదరంతో ఆయనకు స్వాగతం చెప్పారు. అక్కడ కొన్నాళ్ళుండి ఆయన తీర్థయాత్రాపేక్షతో మళ్ళీ బయలు దేరారు. ఆయా ప్రాంతాలలో సుప్రసిద్ధ విద్వాంసులతో మత, వేదాంత చర్చలు చేస్తూ వాళ్ళందరినీ తన మార్గంలోకి ఆకర్షిస్తూ, తన సర్వోత్కృష్టమైన వాదనైపుణ్యాన్ని ప్రకటిస్తూ, ఆర్తులెందరినో చేరదీసి సమాశ్రయణం కలిగిస్తూ శ్రీవల్లభులు విజయనగరం చేరుకున్నారు. అప్పుడు శ్రీకృష్ణదేవరాయలవారు విజయనగర రత్నసింహాసనా రూఢులై ఉన్నారు. ఆ మహాప్రభువు శ్రీవల్లభులవారిని దర్శించుకున్న తర్వాత దేశదేశాగతులైన మహాపండితులను రావించి ఒక మత తాత్విక వాదవివాద మహాసభ నేర్పాటు చేయాలని ఆయనకు అభిలాష కలిగింది. భారతదేశంలోని వివిధ ప్రాంతాల పరమాచార్యులందరినీ ఆయన సమావేశపరచి హిందూమతంలో ఏ తత్త్వదర్శనానికి సర్వోత్కృష్టస్థానం ఉన్నదో ఏది పరమోపాదేయమైన పథమో నిష్కర్షించ వలసిందిగా ఆ చర్చా సభను ఆయన అర్థించారు. శ్రీ వల్లభాచార్యుల వారు ఆవిద్వత్సదస్సులో పాల్గొన్నారు. కాకపక్షధరులైన

బాలవల్లభులు దివ్యతేజస్సుతో వెలుగొందుతూ అపూర్వ వాక్సమత్కృతితో వైదుష్యంతో 28 రోజులు ఆవాక్యార్థ సభలలోపాల్గొని ఒకరితర్వాత ఒకరిగా అందరు ఆచార్యులను ఓడించి తమ తత్త్వనిర్ణయస్థాపనం చేశారు.

మర్రోజున శ్రీకృష్ణదేవరాయలవారు మహాసభ ఏర్పాటు చేసి బాలవల్లభాచార్యులవారిని వేదాంతసామ్రాజ్య పట్టాభిషిక్తులుగా ప్రకటించి ఆయన్ను పరమాచార్య సింహాసనారూఢుణ్ణి చేశారు. వివిద మతాచార్యులకు ఆమహోత్సవ సమాపన వేడుకల సందర్భంగా అంతులేని ధనం పంచిపెట్టాడు ఆమహాచక్రవర్తి. శ్రీవల్లభాచార్యులవారిని అఖండ భూమండలాచార్య, మహాప్రభు, శ్రీమదాచార్య అనే బిరుదావళితో సంస్తుతిస్తూ శ్రీ కృష్ణదేవరాయలవారు శ్రీవల్లభుల గొప్పతనాన్ని చాటారు. ఏడువేల హేమనిష్కాలను సమర్పించి ఆమొత్తాన్ని స్వీకరించాల్సిందిగా రాయలవారు శ్రీవల్లభాచార్యుల వారిని ప్రార్థించారు. కాని శ్రీవల్లభాచార్యులవారు తమ ఇష్టదైవత అర్చారూప అలంకరణార్థం ఏడు బంగారునాణేలు మాత్రం తీసుకొని తక్కినవి రాయలకే ఇచ్చివేశారు.

విజయనగరం విడిచిన తర్వాత ఆయన మరెన్నో పుణ్యక్షేత్రాలు దర్శించారు. వెళ్ళిన చోటనల్లా భగవత్తత్త్వనిర్ణయ ప్రతిపాదకమైన వేదాంతచర్చలు, మతనిరూపణలు చేస్తూ ఆయన వివిధ ప్రస్థానాలకు చెందిన విద్వాంసులతో గోష్ఠి జరుపుతూ ఉండేవారు. అటు తర్వాత ఆయన భారతదేశంలో అత్యంత ప్రఖ్యాతిపొందిన కాంచీక్షేత్రం చేరుకున్నారు. విష్ణుకంచిలో వరదరాజస్వామివారి సన్నిధిలో శ్రీవైష్ణవవిద్వాంసులను సందర్శించి భగవద్రామానుజులవారు ప్రతిపాదించిన విశిష్టాద్వైతాన్ని గూర్చి తమ అభిప్రాయం తెలియచేశారు. "శ్రీరామానుజాచార్యులవారు జగత్తును, జీవుణ్ణీ పరబ్రహ్మను విడదీయరాని లక్షణాలుగా భావిస్తారు. నేను కేవలం వాటిని ఆ పరబ్రహ్మ (భగవంతుని) స్వరూపావిష్కారంగానే భావిస్తాను. భగవద్గీత ఉపనిషత్తులు ఆత్మను బ్రహ్మపదార్థంగా, అందులోని భాగాలుగానే చెపుతున్నాయి. ఆత్మలను అవి అగ్నికీలలతో ఉపమిస్తున్నాయి. సత్తు అయిన జగత్తు స్వరూపము, చిత్తు అయిన ఆత్మస్వరూపము యథార్థానికి పరబ్రహ్మ గుణలక్షణ సంజ్ఞకాలు మాత్రమేకావు. కాలేవు. కేవలం ఆపరబ్రహ్మ స్వరూపావిష్కృతులే అవి. ఆ పరతత్త్వం నుంచి విడదీయరాని అంశాలే అవి. శ్రీరామానుజాచార్యులవారికీ నాకూ ఉండే అభిప్రాయభేదం ఇదేను. శ్రీశంకరులు జగత్తును కేవలం ఆభాస అని మిథ్య అని అనటం అంగీకరించక శ్రీరామానుజులు మంచిపని చేశారు. ఈ విషయంలో శ్రీరామానుజులవారితో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తాను" అన్నారు.

వివిధ తీర్థ పర్యాటనంలో ఆనాటి మహావిద్వాంసుల నెందరినో తన శేముషీవిభవంతో లోగొని ప్రజాసమూహాన్ని భగవత్ప్రేమ కైంకర్యం ఎప్పు మళ్ళించారు శ్రీవల్లభాచార్యులవారు.

ప్రజలలోని అజ్ఞానాంధ్యాన్ని ఆయన తన జ్ఞాన సూర్యప్రభతో పోగొట్టారు. ఆయన చివరకు పండరి దివ్యక్షేత్రాన్ని దర్శించారు. అక్కడి దైవం విఠోబా. ప్రతిరోజూ వేలమంది భారతదేశంలోని అన్ని ప్రాంతాలనుంచి వచ్చి ఆదైవాన్ని సేవించుకుంటూ ఉంటారు. ఈ దివ్యక్షేత్రం మహారాష్ట్రంలో ఉంది. ఈపరమపావన క్షేత్రంలో శ్రీకృష్ణుడు రుక్మిణీసహితుడై వేంచేసి ఉన్నాడు. దేవాలయంలో శ్రీవల్లభాచార్యులవారు శ్రీకృష్ణస్వామి సంకీర్తనలో నిమగ్నమై ఉండగా ఆయనకు అప్రయత్నంగా గృహస్థాశ్రమంపైకి మనసుపోయింది ఎందుచేతనో. ఆయన ఆ తలంపుతోనే ఆరాత్రి గాఢనిద్రలో ఉండగా ఆయనకు ఒకకల వచ్చి అందులో ఒక దివ్యసందేశం ప్రసాదితమైంది. పాండురంగ విఠలనాథుడు ఆయన కలలో కన్పించి నిస్సందేహంగా నీవు గృహస్థాశ్రమస్వీకారం చేయాల్సిన సమయం ఆసన్నమైంది. నీవు గొప్ప ఆచార్యుడివి అవుతావు గాని సన్యాసివికావు. నీస్వస్థలానికి వెళ్ళి పెళ్ళి చేసుకోవాల్సింది. నీకు ఇద్దరు కుమారులు కలుగుతారు. చిన్నవాడికి నాపేరు పెట్టవలసింది. ఇతడు నీ బోధలకు ఆశయాలకు విస్తృతి కల్పించి పోషించి వ్యాప్తిలోకి తెస్తాడు" అనిఆయన్ను అనుగ్రహించాడు. ఈ స్వప్నంవల్ల శ్రీ వల్లభాచార్యులవారి భవిష్య జీవితపరిణామాలు మహత్తరంగా నిర్దేశితమైనాయి.

మొదటిసారి ఆయన జరిపిన పుణ్యక్షేత్ర పర్యటనలో వారణాసి నుంచి దక్షిణదేశపు చిట్టచివరి కొసవరకు ఆయన దర్శించాడు. ఆయన తన పర్యటనలో దేశంలో మతసాంస్కృతిక విలువలు ధ్వంసమై ఉండటం గమనించాడు. రాజకీయ ఉపద్రవాలవల్ల సంఘంలో ఆస్తిక విలువలపట్ల విశ్వాసరాహిత్యం వల్ల దేశంమంతా ఆధ్యాత్మికత లోపించింది. మతదృక్పథం క్షీణించింది. ఎక్కడ చూసినా మతప్రవర్తకులలో వేషధారులు, కపటులు, వంచకులు, సాహంకారదోషదూషితులు, దాంభికులు బయలుదేరారు. బాహ్యాడంబరాలకు, టక్కుటమారాలకు కర్మకాండ తావలమై పరమార్థాన్ని కోల్పోయింది. పటాటోపానికి ఆకర్షణ ఎక్కువైంది. గంగాతీరంలో కూడా మోసగాళ్ళు ఎక్కువైనారు. మంత్రశక్తి క్షీణించింది. అశుచులు అనర్హులు మంత్రకలాపం సాగించటానికి నెట్టుకొని ముందుకు వస్తూ ఉండటంతో ఆ మంత్రోచ్చారణశక్తి, ప్రభావమూ నిష్ఫలమైపోయాయి.

*

# ఆదిశంకర జన్మభూమి క్షేత్రం-కాలడి

*(గత సంచిక తరువాయి)*

*డాక్టర్ మల్లీప్రియ నాగరాజు*

ఆర్యాంబ అంత్యదశలో క్షణంలో శంకరాచార్యుల వారు కాలడికి చేరారు. ఆర్యాంబ అత్యంత ఆనందంతో కుమారుని చేతిలోనే అస్తమించింది. ఆమెను వైకుంఠానికి పంపారు. (ఆమె బాలకృష్ణుని భక్తురాలుగనక). అయితే సన్యాసికి తల్లి శవాన్ని దహనం చేసే హక్కు లేదన్నారు కాలడి బ్రాహ్మణులు. 10 కుటుంబాలలో రెండు కుటుంబాలే సహాయం చేసాయి. "కొప్పిల్లి మన, తలయేత్తుం పిల్లి మన," ఆ రెండు కుటుంబాలే నేడు ఉన్నాయి. మిగతా కుటుంబాలు నాశనమైపోయాయి. ఆమె శరీరాన్ని ఇంటి పెరటిలోనే యోగాగ్నిచే దగ్ధం చేశారు శంకరులు. ఆయన పడిన మనోవేదన వర్ణనాతీతం. ఆయన వేదనే వారికి శాపమైంది. నేటికీ నంబూద్రి బ్రాహ్మణులు శవాలను దొడ్డిలోనే దహనం చేయటం గమనార్హం.

ఇక భారతదేశమంతా పర్యటించిన శంకరాచార్యుల వారిని ఎందరు ఢీకొన్నారో చెబితే ఆశ్చర్యం వేస్తుంది. బౌద్ధులు, శాక్తేయులు, జైనులు, పాశుపతులు, వీరశైవులు, వైష్ణవులు, ద్వైతులు, వామాచారులు, వైఖానసులు, పాంచరాత్రులు, కాపాలికులు, హిరణ్యగర్భోపాసకులు, అగ్ని ఉపాసకులు, అగ్నిహీనులు, సూర్యోపాసకులు, గాణాపత్యులు, చార్వాకులు, సౌగతులు, శూన్యమతస్థులు, క్షపణకులు, విష్వక్సేనులు, ఇంద్రోపాసకులు, కాపిలులు, అర్హతమతస్థులు, నాస్తికులు. ఇంతమందిని ఢీకొని ఓడించి "అద్వైత" మతస్థాపన చేసారు జగద్గురు శంకరాచార్యుల వారు. ఇన్ని మతాలకు చెందిన విద్యావేత్తలను ఒకే వ్యక్తి జయించ గలిగాడంటే : జయించి అద్వైతం బోధించ గలిగాడంటే, శంకరాచార్యుల వారు సాక్షాత్తు శంకరులేనని మనం గ్రహించవచ్చు.

శంకరుల అభయవాణికి ధర్మదేవత స్వాస్థ్యము వహించింది. మేధాబలంతో కొమ్ములు తిరిగి, అపమార్గాములైన దిగ్గంత పండితులనేకులు శంకరాచార్యుల వారిని ఎదుర్కొని, అతడి సత్యసాక్షాత్కార బలం ముందు కకావికలై, ధర్మవశులైనారు. మిథ్యాపాండిత్య గర్వంతో పైకి నిక్కిన ప్రతి హృదయ దుర్గ శిఖరం మీద శంకర భగవానుడు తన సత్య వేదాంత విజయ పతాకాన్ని ప్రతిష్ఠించాడు. కాశ్మీర్ చేరి అనితర సాధ్యమైన "సర్వజ్ఞ" పీఠాన్ని అధిష్ఠించిన ఏకైక యుగపురుషుడు ఆది శంకరాచార్యుల వారు. బహు గ్రంథాలను వ్రాసి, శిష్యులచే వ్రాయించి, తమ 32వ ఏట క్రీస్తుశకం 820లో హిమాలయ నిబిడారణ్య గర్భంలోని కేథారనాథ్‌లో గల దత్తాత్రేయ గుహలో వారు మహా నిర్యాణమొందారు.

# కాలడి - పరిశోధన

ఇంత వరకూ శంకరాచార్యులవారి పూర్వీకులైన నంబూద్రి బ్రాహ్మణులను గూర్చి, శంకర భగవత్పాదుల జీవితాన్ని గూర్చి తెలుసుకొన్నాం. ఆ ప్రదేశాలన్నీ కాలడిలోనూ, పరిసర ప్రాంతాలలోనూ నిజంగా ఉన్నాయా? ఉన్నాయి. నేడూ మనం దర్శించవచ్చు. 1991 మే తేదీన ప్రారంభమై 1995 జూన్ 22న ముగిసిన నా "ఆదిశంకర జన్మ భూమిక్షేత్రం కాలడి" పరిశోధనను క్లుప్తంగా వివరిస్తాను. కాలడిలోనూ ఆ పరిసరాలలోనూ గల ఆ పుణ్య స్థలాలను - ఇదుగో నాకన్నులతో దర్శించండి : తర్వాత మీకన్నులతో చూడాలనే కోర్కె మీకే కలుగుతుంది.

**(1) ఆదిశంకర కీర్తి స్తంభ మండపం** : మనం కాలడిలో దిగగానే మనకు కనిపించేది "శ్రీఆది శంకర కీర్తి స్తంభ మండపం". రెండు తాటిచెట్ల ఎత్తున ఉండే ఈస్థూపాన్ని కంచి - కామకోటివారు నిర్మించారు. ఈ స్థూపం ఎక్కుతుంటే శంకరాచార్యులవారి జీవితం, ఆయన వివిధ క్షేత్రాలను, దేవుళ్ళను పూజించిన విధానం శిల్పాలుగా చెక్కబడింది. స్థూపం ఊరి పొలిమేరలో ఉండటం వల్ల, పైనుంచి చూస్తే కాలడికి 50 కిలోమీటర్ల వరకూ గల రమణీయమైన ప్రకృతి సంపద మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. (స్థూపం వెనుక వైపుగా కాలడి గ్రామం ఉంటుంది). ఇంత మనోహరంగా దీన్ని నిర్మించిన కంచి - కామకోటివారు నిజంగా అభినందనీయులు. 1995 మే 15, 16, 17, 18, 19 తేదీలు అయిదు రోజుల పాటు నేను ఇక్కడ నిద్రించాను. చక్కని పుస్తక విక్రయశాల, శంకరాచార్య ఆలయం, శివాలయం క్రింద ఉన్నాయి. తెలుగు పుస్తకాలు కూడా ఇక్కడ ఉండటం విశేషం. దీని నిర్వాహకులైన శ్రీ యం. వేంకటరామయ్యర్ నిజంగా పరమ నిష్ఠా గరిష్ఠులు. "పశంతోట్టం"లోని "స్వర్ణత్తుమన గూర్చి 1993లో నాకు వివరించిన వారు వీరే. కాలడిలో (ఎవరూ సరైన వివరాలు చెప్పలేక పోయారు).

**(2) పూర్ణానది (పెరియార్)** : 8వ శతాబ్దంలోఈనది కాలడికి కొంచెం దూరంలో ఉండేది. తల్లి ఆర్యాంబ కోసం బాలశంకరులు దాని గమనాన్ని మార్చారు. ఒకపాయ చీలి శంకరుని ఇంటి ముందుగా ప్రవహించేట్లు చేశారు. భారతదేశంలో గల ఏనదిలోనూ నీరు ఇంత నిర్మలంగా ఉండదు. ఇక్కడస్నానం చేస్తుంటే కలిగే అనుభూతి అనుభవైక వేద్యం. ఈ 5 ఏళ్ళలో శంకరుని మొసలి పట్టుకొన్న ఘట్టంలో గంటల తరబడి స్నానం - కనీసం 100 సార్లు చేసి, నేను పరిపూర్ణమైన ఆరోగ్యాన్ని 1995 లోనే పొందాను.

*(సశేషం)*